Photo by D. I. Chanthamian



బహుమతి
పొందిన వ్యాఖ్య

అంటీ అంటని దూకు

పంపినవారు :
కె. రామలక్ష్మి - బెల్‌గామ్

# చందమామ

## [పిల్లల కథల మాసపత్రిక]

మహాశయా !

గత అయిదున్నర సంవత్సరాల కాలంలో "చందమామ" తెలుగు బాల బాలికలలో అపూర్వమైన పఠనాసక్తి కలిగించి, తెలుగు పత్రికలో అనన్యప్రచారం సాధించి, తెలుగు పత్రికాసాహిత్యంలో గొప్ప పరిణామం సాధించిన సంగతి మీ రెరిగినదే.

"చందమామ" తెలుగులోనేగాక, తమిళ, కన్నడ, మళయాళ, హిందీ, మరాఠీ భాషలలో కూడా వెలువడి, ఆయా ప్రాంతాలవారి ప్రశంసలను విరివిగా సంపాదించి, 1,20,000 కు పైగా అమ్ముతూ, అఖిలభారతసంస్థగా పరిణమించడం ఆంధ్రులందరికీ గర్వకారణమని వేరే చెప్పనక్కరలేదు.

ఈరీతిగా మాకులభించిన బహుముఖ ప్రోత్సాహాన్ని పురస్కరించుకుని 1953 జనవరినుంచి "చందమామ"ను మరింత ఆకర్షవంతంగా చేయడానికిగాను రెట్టింపు మందముగల గ్లేజు కాగితముపై ద్వివర్ణ చిత్రములతో అందముగా వెలువరించ నున్నాము.

"చందమామ" గ్రంథాలయ పఠనయోగ్యమని మద్రాసులోని డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ ఎన్నికచేసియున్నారు. కనుక "చందమామ" ప్రతి పబ్లిక్ లైబ్రరీ లోనూ, స్కూలు లైబ్రరీలోనూ ఉంచదగిన పత్రిక ఈవిధంగా వుంచినట్టయితే పేద బాలబాలికలకుసయితం అందుబాటులోకి రాగలదనే ఉద్దేశంతో లైబ్రరీలకొరకున్నూ, లైబ్రరీలు శిఫార్సుచేసిన పేద బాలబాలికలకొరకున్నూ "చందమామ" చందాను క్రిందివిధంగా తగ్గిస్తున్నాము.

సంవత్సరానికి రు. 4-0-0
రెండు సంవత్సరాలకు రు. 7-8-0

ఈ ప్రత్యేక సౌకర్యము 31-12-52 వరకు మాత్రమే అమలులో ఉంటుంది గనుక గ్రంథాలయములవారు త్వరపడవలసినదని మా ప్రార్థన.

మేనేజరు,
చందమామ పబ్లికేషన్స్,
మద్రాసు - 26.

## PROCEEDINGS OF THE DIRECTOR OF PUBLIC INSTRUCTION, MADRAS

R. C. No. 1126-J/47, Dated 8—8—1947

Books and Publications - Patronage to Magazine "AMBULIMAMA" and "CHANDAMAMA"

Read: Letter dated, 10th July 1947 from the Managing Proprietors "AMBULIMAMA", Madras.

The following Publication may be brought to the notice of the *Elementary* and *Training* Schools in the Presidency.

"AMBULIMAMA" and "CHANDAMAMA"

A monthly magazine in Tamil and Telugu intended for children published by Sri B. N. Reddi at B. N. K. Press, Ltd., 2 & 3, Arcot Road, Vadapalani, Kodambakkam, Madras.

Price **6** as. a copy and Rs. **4/8** for a year.

(TRUE COPY) FORWARDED (BY ORDER)

R. S. SWARNAMBAL,
for Director of Public Instruction.

(Sd.) x x x
SUPERINTENDENT.

To the District Educational Officers.
To the Inspectresses of Girls Schools.
To the Principal, Teachers College, Saidapet.
To the Principal, Lady Willingdon Training College, Madras.
To the Principal, Government Training School, Rajahmundry.
Copy to the Divisional Inspectors of Schools.
Copy to J Sections and G Sections.

RVR 9/8/- (TRUE COPY)

**CHANDAMAMA PUBLICATIONS**
**VADAPALANI : MADRAS-26**

ఆంధ్ర దేశమంతటా
ఈ నెలలో విడుదల!




*Release through*

**THE VAUHINI PICTURES LTD.,**

MADRAS... VIJAYAWADA... GUNTAKAL

# ఈ సంచికలో యివి చదువుకోండి



ఇవన్నీగాక ఇంద్రజాలం, ఫోటో వ్యాఖ్యలపోటీ
ఆకర్షవంతమైన మరికొన్ని క్రొత్తశీర్షికలు వున్నై.

# పిల్లలందరూ కోరేవి!



పెలికన్ టూఫీలు

గ్లూకోస్, పాలు మీగడ, పంచదార విటమిన్లతో తయారు చేయబడినవి.........




ఆంధ్ర, నైజామ్స్ & ఒరిస్సాలో ఏజంట్లు: టెరిటోరియల్ ఏజన్సీస్, విజయవాడ.

బ్రాంచి: తిమ్మన్నచెర్ల (R. S. గుంతకల్లు)

మిశ్రమ లోహముపైన బంగారురేకు అతికించి తయారు చేయబడిన రాజా ఆభరణములు 10 సం॥ గ్యారంటీ.




2·2" సైజు మిరియం, వంకీ, డజెనుల గాజులు జత 1 కి రూ. 7-0-0. ఆర్డరుతో అన్ని ఆభరణముల కేటలాగు పంపబడును. పోస్టేజి 1-0-0 అదనము.

రాజా గోల్డు కవరింగు కంపెనీ (రిజిష్టర్డు)
రాజాబిల్డింగ్సు : : మచిలీపట్నం.



# డోంగ్రేగారి

## బాలామృతం

బలహీనమైన బిడ్డలకు పుష్టినిచ్చి, పండ్లు మొలిచేటప్పుడు అయ్యే విరేచనములు నిలిపి, బలమును ఆరోగ్యము నిచ్చును.

K. T. Dongre & Co., BOMBAY-4


త్వరలో వస్తూంది!
విజ్ఞాన వినోదాలను
ఉత్తమ స్థాయిలో అందించు
శ్రీ రాజరాజేశ్వరీ ఫిలిం కంపెనీ వారి
పేదరైతు
అంజలీదేవి..కన్నాంబ
లింగమూర్తి..రేలంగి..శ్రీరామమూర్తి
డైరెక్టర్...
కె.బి.నాగభూషణం
అసోసియేట్
ఇంటూరి





చమ్రియా రిలీజ్...

# చందమామ

సంచాలకుడు :: చక్రపాణి

సంపుటి 11 : నవంబర్ 1952 : సంచిక 5


క్రిందటినెల సూచించినట్టుగా, ఈ సంచికనుండి 'రత్నకిరీట 'మనే కొత్త సీరియల్ ప్రారంభించాము. ఇది, అడుగడుగునా అద్భుత సంఘట్టనలతో అల రారుతూవుండే రసభరితమైన ఒక అపూర్వ గాథ అనే విషయం క్రమేణా మీకే అవగత మవుతుంది. తరువాత—కొత్త సంవత్సరం చందమామలో కొన్ని మార్పులు చేయటం పాఠకుల అభిలాషగా కనబడు తున్నది. తప్పక చేయటమే మా ముఖ్యోద్దేశమున్ను. ఐతే—లోగడ, ఇటీవల, ప్రవేశపెట్టిన ఆయా శీర్షిక లలో మీకు నచ్చినవి ఏవి, మానివేయతగ్గవి ఏవి, కొత్తగా చేర్పతగినవి ఏమిటి?—ఈ విషయాలన్నీ బాగా ఆలోచించి, సలహారూపకంగా మాకు వ్రాయండి. వీలైనంతవరకు అమలు చేయటానికి యత్నిస్తాము. ఇందునుగురించి మీ జా'బు'లు ఈ చిరునామాకు పంపండి: 'కథలతాతయ్య'

చందమామ ఆఫీసు, మదరాసు-26.



# దీపావళి నాడు






అన్నదమ్ము లిద్దరు ఒక వూళ్ళో
ఇద్దరు పిన్నవయసు వాళ్ళే.
పదహారేళ్ళవాడు ఒకడైతే
మరిఒకనికి పదమూడేళ్ళే.

పెద్దవాడు నేర్పరి, సతతం తన
సుఖమే చూచుకొనేవాడు.
పని ఎగగొట్టే వీలు దొరికితే
ఇక చేతికి చిక్కడు వాడు.

ఒక్కసారి దీపావళి రోజున
వాళ్ళమ్మకు జ్వరమొచ్చింది.
చేసేవారు లేరు వేరెవ్వరు,
వచ్చిపడిందీ ఇబ్బంది.

కలకల లాడుతోంది ఊరంతా
వీరింట్లో వేడుక లేదు.
పగలల్లా ఊరకనే కూచుని
అన్నకు తోచిందే కాదు.

చీకటి పడగానే ఊరంతా
దేదీప్యంగా వెలిగింది.
అన్నకు బయట తమాషా చూదా
మని ఆలోచన కలిగింది.

'ఒరే! నీవు అమ్మను కనిపెట్టుక
కూచొని ఉండు ఇంటిలోనే.
నేను అలా బయటకు వెళ్ళొస్తా'
అన్నా డన్న ఊరుకుతూనే.



చిన్నవాడు కదలకనే తల్లిని
కనిపెట్టుక కూచున్నాడు.
అన్న సంబరం చూస్తున్నాడని
అనుకొనలేదేమీ వాడు.

వేళకు మందిస్తూ, పరిచర్యలు
చేస్తూ మేల్కొని ఉన్నాడు.
ఇంటి దీపమే కంటిపాపగా
దీపావళి కల కన్నాడు.

అక్కడ పెద్దవాడు సంబరపడి
తల్లి సంగతే మరిచాడు.
బాణాసంచా రవ్వల వెలుగులు
చూచి చప్పటులు చరిచాడు.

ఇంతట్లో ఒక రవ్వ ఎగిరిపడి
దుస్తులంటుకొని మండాయి.
కాలిందొళ్ళంతా నిముసంలో
కేకలు వేశాడబ్బాయి.

చుట్టూ ఉన్నజనం ఎట్లాగో
కూడి మంట లార్పేశారు.
మందులు పూసి కట్టుకట్టించీ,
ఇంటి కెలాగో చేర్చారు.

అన్నయ్యేనని సంతోషంగా
తమ్ముడు తలుపులు తెరిచాడు.
కాని సిగ్గుపడి ఎత్తలేదు తల,
అన్న ఇంటిలో దూరాడు.







రచన: "బైరాగి"



1




2



3



4



5



6



7



8



9

ఇక్కడ తొమ్మిది బొమ్మలున్నవి. వీటిల్లో ప్రతి బొమ్మలోనూ మా చిత్రకారుడు ఒక్కొక్క విధమైన తప్పు చేసివున్నాడు. ఆ తప్పులేమిటో మీరు పట్టగలరా?

సరిఅయిన జవాబులకు వచ్చేనెల చందమామ చూడండి.





# లింగం స్టోర్సు

కోటిలింగమనే జంగం రాజమహేంద్రవరం వెళ్ళి, అక్కడ ఒక పెద్ద దర్జీవానివద్ద సమస్త జనులకూ పనికివచ్చే బట్టలు అన్నీ కుట్టడం నేర్చుకు చక్కావచ్చాడు. తన వూళ్ళో వాళ్ళకి అమాదిరి దుస్తులన్నీ తక్కువ మజూరీకి కుట్టిపెట్టి, రోజూ ఎలాగ లేదన్నా రెండు మూడు రూపాయలదాకా కళ్ళజూచేవాడు. అతని భార్య చాలా పొదుపరి. వచ్చే రాబడిలో సగమే ఖర్చుచేసి, సగం నిలవవేసేది. ఇలా ఉండేసరికల్లా నాలుగైదేళ్ళలో ఒక వెయ్యి రూపాయలు పోగయాయి. ఆ వెయ్యిరూపాయలు పెట్టి వాళ్ళు మంచి భూమి కొనుక్కున్నారు.

రోజులు సుఖంగా వెడుతూవుండగా—ఇంతలో యుద్ధం వచ్చి, మిలిటరీవాళ్ళకి దుస్తులు కుట్టడానికి కంట్రాక్టులు బయలేదిరినై. ఎక్కడెక్కడి దర్జీలనీ, బోలెడంత ఆశచూపి కంట్రాక్టరులు లాక్కుపోసాగారు. "ఇక్కడ ఎంతకాలమున్నా రోజూ రెండు రూపాయలు రావటం దుర్లభం. నాతో మద్రాసు రా, నెలకు రెండువందలు ముట్టజెబుతా" అని అంటూ ఒక కంట్రాక్టరు కోటిలింగాన్ని చెన్నపట్నం లాక్కుపోయాడు.

చెన్నపట్నంలో మూడువందల మిషన్ల మధ్య మిషను పెట్టుకొని రాత్రనక పగలనక కోటిలింగం పంట్లాములూ, కోట్లూ కుట్టేవాడు. కుట్టగా, కుట్టగా, అతగాడి మెదడులో ఒక ఆలోచన ప్రవేశించింది: "శ్రమంతా మనం పడుతోంటే, చూస్తూండగా లాభాలన్నీ కంట్రాక్టరు కొట్టేస్తున్నాడే! మనంతట మనమే ఒక చిన్నకంట్రాక్టు తీసుకుంటే ఇంకా ఎక్కువగా లాభాలు సంపాదించవచ్చుకదా" అని.

ఈ ఆలోచనతో అతడు ఆ పని మానేసి తనే ఒక చిన్న కంట్రాక్టు తీసుకున్నాడు. కంట్రాక్టర్లకి గుడ్డకొనటానికి పెట్టుబడికి

ఆర్. పట్టూ - హైదరాబాద్






డబ్బు కావాలికదా! కోటిలింగం భూమి అమ్మేసి సొమ్ము తెచ్చాడు. మొదట అతని భార్య భూమి అమ్మెయ్యవద్దని గోలపెట్టింది గాని కంట్రాక్టులో ఐదువేలు లాభంరాగానే ఉబ్బి తబ్బిబ్బై, ఆ ఐదువేలూపెట్టి మళ్ళీ భూమి కొనెయ్యమంది.

కాని అతడు ఎంతమాత్రం వప్పుకోలేదు. జూదంలో గెలిచినవా డెప్పుడూ ఆ డబ్బుతో తృప్తిపడి వెళ్ళడు. ఇంకాఎలాగైనా గెలవాలన్న ఆశతో కొత్తపందేలు వేస్తాడు.

అలాగే కోటిలింగం కాంట్రాక్టుమీద కాంట్రాక్టు పుచ్చుకొని కోటీశ్వరుణ్ణి ఔదా మనుకున్నాడు. కాని దురదృష్టవశాత్తూ అంతలోనే యుద్ధం అగిపోయింది, దానితో గుడ్డల కంట్రాక్టులూ నిలిచిపోయినై.

ఐతేం, చేతిలో డబ్బు ఆడుతోంది కనక, దాన్ని వ్యాపారంలో పెట్టి లాభాలు తియ్యాలన్న ఉబలాటం ఎక్కువైంది కోటిలింగానికి. ఆలోచించగా, రెడీమేడ్ బట్టల షాపు పెట్టాలని తోచించి.

తోచటమే తడవుగా బజార్లో ఒక పెద్ద హాలొకటి అద్దెకు తీసుకొని, 'లింగంస్టోర్సు' అనే బోర్డొకటి వేలాడదీసి, జోరుగా వ్యాపారం సాగించాడు. అంతటితో అతడు ఊరుకోలేదు. ఆ హాలుకు సమీపంలోనే ఒకసందులో మరొక ఇల్లు అద్దెకుతీసుకొని, అక్కడ మిషను పెట్టించి రకరకాల దుస్తులు తయారు చేయించి, అద్దాల బీరువాలలో పెట్టి, అమ్మేవాడు.

వ్యాపారం బాగానే సాగింది. కొన్నాళ్ల పాటు ఉన్నట్టుండి గుడ్డ వెల సగానికి సగం పడిపోయింది. కోటిలింగం ఎక్కువ ధరకి గుడ్డకొన్నాడాయె. కుట్టుకూలీ, కొట్టు అద్దే,తనలాభం చేర్చి చీటీలపై ధరలువేసి, దుస్తులకు వేలాడగట్టి అమ్మజూపేసరికి కొనటానికి వచ్చినవాళ్లు, 'ఈ ధరలుపెడితే ఒకటికి రెండు స్వరూపాలు వస్తాయే!' అని పెదిమి విరిచి మళ్లిపోయేవారు.





అతనికి అమ్ముడుపోయే దారి కనపడ లేదు. పనివాళ్ల జీతాలూ, అవ్వీ అప్పుచేసి ఇవ్వవలసి వచ్చింది. 'నష్టంరాకుండా బయటపడడం ఎలాగా?' అని కోటిలింగం శతవిధాల ఆలోచించాడు.

స్వరాజ్యం రాకపూర్వం మద్రాసులో గుమాస్తాలుకూడా సూట్లు వేసేవారు. స్వరాజ్యం వచ్చాక ఉద్యోగులుకూడా కొందరు సూట్లు మానేశారు.

అందుచేత ఆ 'లింగంస్టోర్సు'లో తక్కిన అన్నిటికన్నా సూట్లుమాత్రమే ఎక్కువగా మిగిలిపోయాయి. ఈ సంగతి ఆలోచించి కోటిలింగం ఏం చేశాడంటే—

ఏడేసి సూట్లుచొప్పున బంగీలుకట్టి కాకినాడ, విశాఖపట్నం, బందరూ మొదలైన పట్నాలలో పెద్ద ఉద్యోగస్థులందరికీ పంపడం. లోపల బిల్లులో ఆరు సూట్లకే ధర వేయడం.

బంగీని అందుకొన్నవాడు, అది విప్పి చూసుకొని బిల్లు ఆరుసూట్లకే ఉండటం, సూట్లు ఏడు ఉండటంచూసి, స్టోర్సువాళ్ల పొరబాటుమూలాన ఒక సూటు ఉచితంగా తనకు దక్కిందనుకుని సంతోషిస్తాడు. ఆ సంతోషంలో సూట్లుధర ఎక్కువగా ఉందన్నసంగతి చూసుకోకుండా, బిల్లు



ప్రకారం ఆరుసూట్లకే సొమ్ము మణియార్డరు చేసేస్తాడు!

ఇదీ అతడు చేసిన ఉపాయం.

కోటిలింగం తన ఆలోచనను బిల్లులు రాసే గుమాస్తాతో చెప్పాడు. అందుకు వెంటనే అతగాడు 'బాగానే వుంది. పాత చీటీలు తీసిపారేసి కొత్తచీటీలు తగిలిద్దాం మరి" అన్నాడు.

కోటిలింగం ఇలా ఒకేఒక్క బంగీ పంపించాడు. బందరునుంచి ఎవరో ఒక కాలేజీ కుర్రవాడు వస్తే, అతణ్ణి అడిగి, ఆక్కడ కాలేజీలో లెక్చెరర్ల చిరునామాలన్నీ వివరంగా తెలుసుకున్నాడు. వాటిలో ఒకటి ఓ. టి. వి. రావు, ఎం. ఏ.

ఆయనపేరు చూస్తే సూట్లువేసుకునే బాపతే అని తోచి కోటిలింగం, తన మొదటిబంగీని రావుగారికే పంపేడు.

మూడురోజులు గడిచాక బందరునుంచి రావలసిన మణిఆర్డరుకోసం రోజూ ఎదురు చూసేవాడు. కోటిలింగం ఆ రోజున పోస్టు బంట్రోతు తమ స్టోర్సుగుమ్మం ఎక్కుతోంటే అతనికి బ్రహ్మానందం కలిగింది. "మని ఆర్డరేనా ఏమిటీ?" అని జవానుని ఆత్రంతో ప్రశ్నించాడు. అందుకు జవాను తడుముకో కుండా "కాదు సార్, పార్శిలు వచ్చింది" అని అన్నాడు.

"ఆ ప్రొఫెసరు పార్సిలు తిరగగొట్టేసి వుంటాడు" అన్నాడు గుమాస్తా.

నిజమే. ఆ స్టోరునుంచి వెళ్ళిన పార్సిలే తిరిగి వచ్చేసింది. కాని అది విప్పి, మళ్ళీ ప్యాక్‌చేసినట్టుగా కనబడింది. కోటిలింగం ఆత్రంతో తనే స్వయంగా పార్శిలు విప్పి చూశాడు.

చూసుకునేసరికి తాను పంపిన ఏడు సూట్లకీ బదులు ఆరుసూట్లే తిరిగివచ్చాయి. బంగీలో ఒక ఉత్తరంకూడా వుంది.

"లింగంసోర్ట్సు, ప్రొప్రయిటరుగార్కి,
536, తిరువళిక్కేణి హైరోడ్డు, మద్రాసు.
అయ్యా,

తాము పంపిన ఆరుసూట్లనూ, ఆ బాపతు బిల్లునూ, ఇందుతో తిప్పి పంపుతున్నాను. నాకు సూట్లువేసుకొనే అలవాటు లేదు.

ఓ. టి. వి. రావు."

ఆ జాబు చదువుకోడంతోనే కోటిలింగా నికి వళ్ళు మండింది. "సూటుకు సూటూ కొట్టేశాడు! అలవాటు లేదుట! మరి ఆ కొట్టేసిన సూటు యేంచేస్తాడో" అన్నాడు లోలోపల బాధపడుతూ.

ఆ మాట గుమాస్తా అందుకొని, "వాళ్ల అబ్బాయికి తొడుక్కోమనిచెప్పి ఇచ్చివుంటా డండీ" అన్నాడు. తనపాచిక పారలేదుకదా అని కోటిలింగం ఎంతగానో విచారించాడు.






బ్రహ్మపుత్రానదీ ప్రాంతంలో, రెండువేల సంవత్సరాలకిందట, భల్లాణరాజ్యం చాలా ప్రసిద్ధికెక్కింది. ఆ రాజ్యానికి ప్రభువు ప్రమోదుడు. శూరుడుగా వీరుడుగా పరాక్రమవంతుడుగా ప్రమోదుడు పేరు పొందాడు. అతని పరిపాలనలో ప్రజ సుఖవంతులుగా ఉండేవాళ్లు.

అన్నివిధాలా సుఖవంతులైన ఆ ప్రజకు ఒక్కటే ఒక్క చింత పట్టుకున్నది. కారణం ఏమైతేనేమి, రాజు ఎన్నాళ్లకూ పెళ్ళిచేసికొనకపోవటమే, వాళ్ల ఈచింతకు హేతువు.

రాజు భీష్మించుకు కూర్చున్నందుకు, ప్రజలు విచారిస్తూ ఊరుకోలేదు. పెద్దలు నలుగురూ సమావేశమై, చర్చలుచేసి, పది ఆమడ దూరంలో కొండమీద తపస్సుచేసుకొంటూవున్న ఒక మహాఋషివద్దకు వెళ్లి ఈ చిక్కు వెల్లడించారు. త్రికాలవేది ఐనటువంటి ఆ మహానుభావుడు వాళ్ళచేతికి ఒక ఫలం మంత్రించి యిచ్చి, 'ఇది మీ రాజు ఆరగించేటట్టు చేయండి, అంతా సుముఖమవుతుంది!' అని చెప్పిపంపాడు.

వాళ్ళు ఉత్సాహంతో మరలివచ్చి, రాజు ఫలాహారంచేసేటప్పుడు ఈ ఫలంకూడా కలిపియిచ్చారు. నాటిరాత్రి, అంతా మాటుమణిగినతరువాత, నిద్రిస్తూవున్న ప్రమోదుడికి వీనుల విందుగా ఒక మధురగానం వినిపించింది. ఇదేమిటా అని విస్తుపోతూ లేచాడు. ఎవళ్లకూ చెప్పకుండా తనొక్కడూ కోట దిగి, ఆ గానంవచ్చిన దిక్కుకి శ్రమపడి చేరుకున్నాడు.

చూడగా—అది ఒక రమణీయమైన ఆరామం. ఆరామంలో ఒక చక్కటికొలను.




కొలను ఒడ్డున కూర్చుని, పదిమంది పరి చారికలమధ్యనున్న ఒక గంధర్వ కన్య వీణ వాయిస్తున్నది!

ఇంతవరకు పెళ్ళివిషయంలో అలక్ష్యం చూపిన ప్రమోదుణ్ణి, ఆనాడు మొట్టమొదట కంటబడిన ఆ గంధర్వకన్య ఎంతగానో ఆకర్షించింది! ఆకర్షించడమేమిటి? ఆమెను తప్ప మరొకతెను పెళ్ళాడనని పట్టు బట్టాడు. ఇదే ఆ ఋషి అనుగ్రహించిన ఫలానికి ఫలితం కాబోలునని అందరకూ అవగాహనయింది—అనగా, ఆఫలం ఆర గించిన తరవాత తొలుతగా ఏకన్యను చూస్తే, ఆమెపైన మనసుపోతుందని. ఈవిధంగా ఆ మహానుభావుని కృపవల్ల, ప్రమోదుడికి గంధర్వకన్యతో అతివైభ వంగా వివాహంజరిగింది. ఇలా జరగటం రాజ్యంలో అందరకూ ఆనందాన్ని కలిగిం చింది. మరికొద్దికాలానికే వారికి ఒక కుమారుడు కలిగాడు. వానికి మహీపాలు డని నామకరణంచేసి, అల్లారుముద్దుగా పెంచుకొంటున్నారు. కాలమానం హాయి గానే సాగిపోతున్నది.

ఇలావుండగా—ఒకరోజున ప్రమోదుడు మామూలుప్రకారం వేటకు వెళ్లాడు. అను కొన్నట్టుగా ఆనాడు జంతువులేవీ ఎంత సేపటికీ దొరకలేదు.

అందుచేత, అడవుల లోపలికంటా వెతుక్కుంటూ వెళ్ళవలసివచ్చింది. మితి తప్పిన నడకవల్ల రాజుకు బడలికకలిగింది. దప్పిక అయింది. దాహానికి ఆగలేక అటు యిటు చూచేసరికి అల్లంతదూరాన ఒక కుటీరం కనబడింది. అది అడవులను పాలించే కిరాతరాజు నివాసం. అంద చందాలతో అమరివున్న ఆ చిన్నికుటీరంలో ఒక అందాలచిన్నదికూడా వున్నది. ఆమె కిరాతరాజు కుమార్తె, మందాకిని.

వయ్యారపు నడకలతో మంచినీళ్లు తెచ్చి అందిచ్చిన ఆ ఒప్పులకుప్పను చూడగానే రాజుకు ఆమెపైన మనసు పోయింది. ఇలా

మెచ్చి కోరుకున్న ప్రమోదుడు ఆమెను గాంధర్వవిధిగా చేపట్టి, తనవెంట కోటకు తీసుకుపోయాడు.

మందాకిని మంచిరాణి అని రాజ్యంలో వాడుకపడింది. మనిషికి గుణం ప్రధానం కాని కులం కాదని ప్రజలు సంతృప్తి చెందారు. ప్రజల సంతృప్తివల్ల ప్రమోదుని రాజ్యపాలన చాపకింది నీటిలాగ ఒడు దొడుకులు లేకుండా సాగిపోతున్నది.

మరికొద్దికాలానికే అదృష్టవశాన చిన్న రాణి మందాకినికికూడ ఒక పుత్రుడు కలిగాడు. పుత్రుడు కలగటంతో, ఇంత వరకు మాయా మర్మములేక మసులుతూ వచ్చిన మందాకిని మతమే మారిపోయింది. అటువంటప్పుడు, ఆమెవల్ల గంధర్వకాంత నిరాదరణ పొందినదన్నా, ఆమెచేతులలో మహీపాలుడు చెప్పరానిపాట్లు పడుతున్నా డన్నా ఆశ్చర్యం దేనికి?

మందాకినిలో కలిగిన మార్పు ఇలా వుండగా, కలలోనైనా తలపలేని మరొక చిత్రమైన మార్పు వచ్చింది. అదేమిటీ అంటే, గంధర్వకాంత ఇలాయోచించింది:

'కోరితెచ్చుకున్న చిన్నరాణి హయాము చెలాయిస్తున్న దిప్పుడు. ఆమె యిష్టానికి రాజు ఎంతమాత్రమూ ఎదురుచెప్పలేదు.




మాటకువిలువలేనప్పుడు బలవంతాన ఇక్కడ ఉండి నేనెందుకు బాధపడాలె? నావల్ల ఇతరులకు ఎందుకు బాధకలిగించాలె?— పోతే—ఎవరు ఏమన్నప్పటికీ, పట్టంకట్టుకో వలసినవాడు పసివాడు మహీపాలుడు. ఈ సంగతి రాజుకు తెలియదా, రాజ్యంలోని ప్రజకు తెలియదా?—కానీ, ఏదెలా కానున్నదో చూదాం' అనే వూహతో గంధర్వకాంత ఒకనాటిరాత్రి పిట్టకైనా తెలియకుండా అదృశ్యమైపోయింది.

సవతి ఇలా అదృశ్యంకావటం మందాకి నికి సంతోషమే కలుగజేసింది. ఏమి! ఆమె ఎకటలేదుగనక యిష్టంవచ్చినట్లల్లా పిల్లవాడిని యాతనలుపెట్టి కసితీర్చుకో




వచ్చు. తన కోరికలన్నీ నెరవేర్చటానికీ, దుండగాలకూ దుశ్చేష్టలకూ తోడుపడటానికీ తండ్రిఐన కిరాతరాజు సాయంగానే వుంటున్నాడు.

ఇప్పుడు ముఖ్యంగా, తన ముద్దుబిడ్డడైన అర్ధకర్ముడికి పట్టంకట్టించాలెననే పట్టుదల ఆమెమనసులో వృద్ధిపొందుతూవచ్చింది. ఆమెకు ఈ కాంక్ష వృద్ధిఐనకొద్దీ సవతిబిడ్డపట్ల కాఠిన్యం ఎక్కువకాసాగింది.

కొడుకుమీది మక్కువ ఎంతగా ఎక్కువయిందంటే—సవతిబిడ్డడిని హతమారిస్తే కాని తనకుమారుడు గద్దెఎక్కటానికి వీలుపడదనే నిశ్చయానికి వచ్చింది. ఎటువంటి దారుణానికి ఒడికట్టటానికైనా ఆమెమనసు వెనుకాడలేదు. ఎప్పుడైతే ఈ విషబీజాలు ఆమెహృదయంలో పడినయో, ఆ క్షణం నుంచీ అవి మొలకెత్తి పెరుగుతూనే వున్నయి. రాత్రింబవళ్లు తిండీ నిద్రా లేకుండా, మందాకిని ఈ సమస్యను గురించే తీవ్రంగా ఆలోచన చేస్తున్నది. ఈ కోరిక ఫలించటంకోసమే ముక్కోటి దేవతలకూ మొక్కుతున్నది. ఆమె ఆలోచనలు ఫలించేటందుకు తగిన అనుకూలపరిస్థితులుకూడా అమరటానికి ఎంతో కాలం పట్టలేదు.

* * *

ఉన్నట్టేవుండి భల్లాణరాజ్యంలో ఒక చిత్రమైన వదంతి వ్యాపించింది—'గంధర్వులు దేవగణానికి చెందినవాళ్ళు. దేవతలను మానవులు వివాహంచేసుకోవటమనేది కేవలమూ విడ్డూరమూ, శాస్త్రవిరుద్ధమున్నూ. ప్రమోదుడు, కనివిని ఎరుగని ఇటువంటి పని చేయటానికి సాహసించాడు. తీరికూర్చుని గంధర్వకాంతను పెండ్లాడినాడయె! పైగా, ఆమెవల్ల కుమారుణ్ని కూడా కన్నాడాయె!! ఈ పరిస్థితుల్లో దేవతల కోపకారణం వేరే వెతకాలెనా? ఇక్కడికి రెండేళ్లనుండి వర్షాలు ఎత్తికట్టటానికీ, పంటలు నాశంకావటానికీ ఇదే

కారణం' అంటూ ఈవిధంగా దేశమంతటా వదంతి మోగిపోతున్నది.

అనోటా అనోటా పాకి, ఈమాటలు రాజు చెవిని పడగానే ప్రమోదుడు కలవరపడ్డాడు. 'ఇది నా పొరపాటు కాదే. లోకక్షేమం కోరే ఒక ఋషి చేసిన పని. ఆయన ప్రోద్బలమే లేకుంటే నేను బ్రహ్మచారిగానే ఉండిపోదునే. ఆ మహానుభావుని దీవనకు విరుద్ధంగా ఇప్పుడీ పుకారు ఎందుకు పుట్టింది? ఈ వివాహంవల్లనే ఇటువంటి అరిష్టం కలుగుతుందంటే ఆయన నన్నెందుకు ప్రోత్సహిస్తాడు?' అంటూ తనలో తను తర్కించుకుని తత్తరపడసాగాడు.

తత్తరపడ్డాడే కాని, రాజు ఒక తీర్మానానికి రాలేకపోయాడు. ఇటువంటి సమస్యలను పరిష్కరించటానికీ, ఇదమిద్ధమని తేల్చటానికీ సమర్థులు పూర్వంనించీ, రాజగురువులైన పురోహితులే.

కనుక, తక్షణమే రాజు ఆస్థాన పురోహితుణ్ణి పిలిపించాడు. మనసులో కలిగినటువంటి బాధ వెల్లడించి, గత్యంతరమేమిటని ప్రశ్నించాడు.

పురోహితుడుకూడా ఈ వివాహం శాస్త్ర విరుద్ధమేనని నిష్కర్షగా చెప్పాడు. ఐతే—మరి దీనికి పరిహారమేమిటి? అనే ప్రశ్న




వచ్చేసరికి కళవెళపడ్డాడు. ఏమీ?—ఒక వంక, అమాయకుడైన పసివాడు మహీపాలుడు కళ్లవెలుగుగా కనిపిస్తున్నాడు! మరొకవంక భీకరస్వరూపం దాల్చి రాణి మందాకిని కఠోరస్వరంతో హుంకరిస్తున్న దృశ్యం కనిపిస్తున్నది!! ఈ యిరువురి మధ్యని పడి నలుగుతున్న తననే యిప్పుడు రాజు ప్రశ్నిస్తూవుంట!!!

ఇన్నింటికీతోడు, రాజుపక్కనే కూర్చుని వున్న రాణి, తన కంఠంమీద చెయ్యివేసి చూపి, సంజ్ఞచేయటంకూడా పురోహితుడు స్పష్టంగా గమనించాడు. రాజు వేసిన ప్రశ్నకు ఏదోవక జవాబు చెప్పితీరాలికద! రాణీ వుద్దేశం తెలియనే తెలిసింది. ఆమెకు




ఎదురెత్తుగా వెళ్లకమంటే తనకు నూరేళ్ళూ నిండినట్టే! అందుచేత, ఈ క్లిష్టసమయంలో 'మనం చేసేది పాపమా, పుణ్యమా ?' అని యోచనచేయటానికే వ్యవధి లేకపోయింది.

'ప్రభూ !— దేవర శాసించారు కనక చెప్పకతప్పదు. దేశానికి పట్టిన అరిష్టం తొలగిపోవాలంటే, దేవగణానికి చెందినట్టీ, గంధర్వకాంతకు పుట్టినట్టీ, బిడ్డను దేవలోకానికి పంపించివేయాలని శాస్త్రాలు ఘోషిస్తున్నాయి' అని అంటూ, చెప్పలేక చెప్పలేక మనవిచేశాడు.

రాజు ఆత్రంతో 'ఏమిటీ! ఏమిటీ!! మళ్ళీ చెప్పండి. నాకు అర్థంకాలేదు' అని పురోహితుణ్ణి వేగిర పెట్టాడు.

అందుకు ఆయన 'మహారాజా !–మన మహీపాలుణ్ణి దేవలోకానికి పంపించివేస్తే రాజ్యం మళ్ళీ సుభిక్షంగా వుంటుందనీ, పసివానికి పుణ్యగతులు కల్పించాలంటే యథావిధిగా బలిచేయాలనీ పండితులంటున్నారు. ఎంతట ఈపని జరుగుతుందా, ఎంతట దేశం బాగుపడుతుందా అని ప్రజలు యెదురుతెన్నులు చూస్తూవున్నారు ప్రభూ!' అని చెప్పాడు, వినయంగా.

దుర్భరమైన ఈమాట వింటూనే రాజు, కూర్చున్నవాడు కూర్చున్నట్టుగా సింహాసనంమీదనే సోలిపోయాడు. ఆయనకు వంటిమీద చైతన్యం ఏమీలేదు. ఏతండ్రి భరించగలడు ఇటువంటి పరిస్థితి! రాణి మందాకిని పట్టరాని దుఃఖంలో మునిగిపోయింది! కొంతసేపు ఉపచారాలు చేసినతరువాత ప్రమోదుడు తేరుకొన్నాడు.

లోకంలో బయల్దేరిన ఈ వదంతి ఆయనను హృదయశల్యంగా వేధింపజొచ్చింది. మనసు ఎంతగా విలకమై పోయినప్పటికీ, తొందరపడక నిదానంగా యోచించాడు. ఇంతమంది పండితులూ, లక్షలాది ప్రజలూ అవునంటున్నది తను కాదనటం ఎట్లా? పుత్రప్రేమ ఎంతగా వున్నప్పటికీ, జనవాక్యానికి యెదురీదటం ఎవరిశక్యం?

నిస్సహాయుడైన ప్రమోదుడు కూలబడ్డాడు. రాజ్యంలో ప్రజల హాహాకారాలు యెక్కువయినై. ఇక వారు భరించలేకపోయారు. 'మహీపాలుణ్ణి బలిపెట్టవలిసిందే!' అనేమాట మారుమోగిపోసాగింది. ప్రజల బాధలు చూచి రాజూ సహించలేక, బలికి సమ్మతించాడు.

మహీపాలుణ్ణి బలిచేయటానికి ఏర్పాటులన్నీ పూర్తిచేశారు పురోహితులు. అదే భద్రకాళి ఆలయం. ఆలయం యెదుట ఇదే బలిపీఠం. సుముహూర్తం పెట్టినరోజు వచ్చింది. పెద్దలందరూ సమావేశమయారు. అక్కడ విరగబడిన అశేషజనం ఇసుకవేస్తే రాలటం లేదు. అంతా నిశ్శబ్దం!

అక్కడ రాజసౌధంలో—తోడిపిల్లలతో ఆటపాటలలో మునిగివున్నాడు పసివాడు మహీపాలుడు. వానిని చక్కా అలంకరించారు. బాజాభజంత్రీలతో ఊరేగించి, నగరు చివరనున్న కాళిక ఆలయానికి తీసుకవచ్చారు. గుడిలో వేదికపైన కూర్చోపెట్టి మంత్రఘోషలు జరిపిస్తున్నారు. ఈ సందడి అంతా దేనికో అమాయకుడైన ఆ బిడ్డడికి తెలియనే తెలియదు, పాపం!

అంతలో ప్రమోదుడు పిచ్చిపట్టినవానిలాగా కోటడిగి పరుగులెత్తుకొంటూ వచ్చాడు గుడికి. తీర్చి కూర్చునివున్న పెద్దలవంక, సభాసదులవంకా తిరిగి, "అయ్యా!—నా వివాహం శాస్త్రవిరుద్ధమన్నారు. ఇది దేవగణాలకు ద్రోహమన్నారు. దేవతలు కోపించి, ఈ దేశారిష్టం కల్పించారంటున్నారు మీరు. కాదనను నేను. ఇందుకు పరిహారంగా బిడ్డడిని బలి యివ్వటానికికూడా ఆటంక పెట్టను. కాని...నాది ఒక చిన్నకోరిక వున్నది...అదిమాత్రం నెరవేర్చండి" అన్నాడు, దీనంగా.




'ఏమిటది?' అని ప్రశ్నిస్తున్నట్టుగా అందరూ ఒక్కసారి రాజువైపు తిరిగారు.

ప్రమోదుడు తుదిసారి బాలుణ్ణి చేరదీసుకొన్నాడు. సభవంక తిరిగి: 'పరిస్థితులు

ఇలా వక్రమార్గం పట్టివుండకపోతే, ఈ చిన్నారి మహీపాలుడు పట్టంకట్టుకోవలసిన వాడేకద! ఐతే, ఇప్పుడు కథ అడ్డం తిరిగింది. విధివిలాసానికి ఎవళ్లయినా తల ఒగ్గవలిసిందే. నా బాబు పట్టాభిషిక్తుడైతే ఎలా వుండేవాడో, ఒక్కసారి నన్ను కళ్లారా చూడనివ్వండి. ఇదే నే కోరేది' అంటూ జాలిగా చెప్పాడు. జనమంతటికీ అప్రయత్నంగా బొటబొటమని కన్నీళ్ళు రాలినై!

ఈ మాట రాణికి మనస్కరించినట్టు లేదు. విసవిసలాడింది. ఏమేమో సంజ్ఞలు చేసింది. కాని యెవరూ లక్ష్యపెట్టలేదు.

అప్పుడు పురోహితులపెద్ద లేచి, 'ప్రజల ఘోష చూచి ఏ ప్రభువు సహించగలడు? జనవాక్యం ఆలించి మన ప్రభువులు పిల్లవాడి బలికి అంగీకరించే వున్నారు. ఇక, గడియో క్షణమో పసివాడి జీవుడు పోనే పోతుందాయె. రాజంతటివాడు స్వయంగా వచ్చి కోరుతున్నప్పుడు కాదనటం మూర్ఖత అనిపించుకుంటుంది. బాలుడికి ఒక్కసారి కిరీటం ధరింపించి, ప్రభువు ముచ్చట తీర్చండయ్యా!' అన్నాడు.

అక్కడవున్న సమస్తజనులూ 'పెట్టండి, బాబుకు కిరీటం పెట్టండి. ఒక్కమాటు కళ్లవేడుకగా చూస్తాం!!' అని ఆవేశంతో కేకలువేయ సాగారు.

తక్షణమే దేవిడినుంచి తళతళ మెరిసే రత్నకిరీటం తెప్పించారు. యథోచితంగా మహీపాలుడి శిరస్సున వుంచారు. పూలమాలలు వేశారు. కోలాహలం చెలరేగుతూ వుండగా, పసివానిని గుడిచుట్టూ ముమ్మారు ప్రదక్షిణం చేయించి, బలిపీఠంముందు నిలబెట్టారు.

మంత్రఘోషలమధ్య పురోహితుడు 'జై శంకరీ! జై భవానీ!!' అంటూ కత్తి ఎత్తాడు. ఆ లక్షలాది ప్రజల నేత్రాలు అన్నీ పసివానిపైనే నిలిచిఉన్నాయి.

ఆ క్షణంలో— [ఇంకా వుంది]






పూర్వం మాళవ దేశాన్ని పుష్కలుడు అనే గొప్ప రాజు ఏలుతూ ఉండేవాడు. ఆయన 'మహాభోగి' అనిపించుకున్నాడు. అందుచేత చుట్టూ చేరిన వాళ్ళంతా, 'మీ ఐశ్వర్యం ముందు ఇంద్రుని ఐశ్వర్యం ఒక లెక్క లోనిది కాదు; మీ ఖజానాకూ ఆ కుబేరుని కోశాగారానికీ పోలికే లేదు. ఈ ప్రపంచంలో సుఖి ఎవరూ అంటే పుష్కలమహారాజు గారిని చెప్పి మరొకరిని చెప్పాలి!' అంటూ పొగడి, తమకి కావలసిన లాభాలు పొందుతూండేవారు. ఆ పొగడ్తలు నమ్మి 'నావంటి భోగీ, సుఖీ, మరొకడు లేడుకాబోలు' అని అనుకునేవాడు రాజు.

ఒకనాడు ఆస్థానానికి జ్ఞానధని అనే ఒక మహాత్ముడు వచ్చాడు ఆయన గొప్పదనాన్ని గూర్చి పుష్కలమహారాజు ఇదివరలోనే విని ఉండటంవల్ల రావటంతోనే, 'మహాత్మా, మీ రాకవల్ల మారాజ్యం పావనమైంది!' అంటూ అర్ఘ్యపాద్యాదులు ఇచ్చి మర్యాదచేశాడు. పంచభక్ష్య పరమాన్నాలతోసూ విందు జరిపించాడు. ఆస్థాన గాయకులను రప్పించి కచ్చేరీలు చేయించాడు. కవులను రప్పించి పద్యాలు చెప్పించాడు. నర్తకులను రప్పించి గొప్పగా నాట్య ప్రదర్శన ఏర్పరిచాడు.

జ్ఞానధని అంతా చూస్తూ ఊరుకున్నాడు. అందరికిమల్లే ఆయనకూడా తన వైభవాన్ని ప్రశంసిస్తాడనుకున్న పుష్కలమహారాజుకి ఆయన పెదవి కదపకుండా ఉండటంతో ఉత్సాహం కొంచెం తగ్గినట్టయింది. ఇక ఉండబట్టలేక, 'మహాత్మా, తమరు దేశదేశాలు మెట్టివచ్చినవారు కదా. నాకన్న సుఖి ఎక్కడైనా తమకు కనపడ్డాడా?' అని అడిగివేశాడు. అందుకు జ్ఞానధని, 'మా ఊళ్లోనే ప్రతాపుడనే అతడొకడు ఉండేవాడు. అతడు అందరికన్నా సుఖి అని

సి. కుమారస్వామి - ఛత్రపురం



''పోనీ ఆ ప్రతాపుడికి తర్వాతనైనా నేను లెక్కకొస్తానా?' అని అడిగాడు రాజు, కొంచెం ఉడుకుమోతుతనంతో.

''ఊహు. ప్రతాపుని తర్వాత వచ్చేవాళ్ళు ఇద్దరన్నదమ్ములు మా ఊళ్ళోనె ఉండే వారు. దేహదార్ఢ్యం కలవాళ్ళు. నిర్మల హృదయులు. పరోపకార పరాయణులై, మరణయాతన లేకుండా ప్రాణాలు వది లేరు' అన్నాడు ధని.

రాజుకి కోపంవచ్చింది. 'ఏదో పెద్దవాడివి కదా అన్నగౌరవంకొద్దీ అడిగితే ఇదా నువ్వు చెప్పొచ్చింది! ఆ పేదవాళ్ళా నాకన్న సుఖ జీవులు?' అని గద్దించాడు. జ్ఞానధని చిరునవ్వుతో, 'రాజా, కొపమెందుకు? ఈ ఐశ్వర్యం, వైభవం ప్రస్తుతం నీకు సుఖాన్ని కలిగిస్తున్నమాట నిజమే. కాని ఏదీ శాశ్వతం కాదు. నువ్వింకా ఎంతకాలం జీవిస్తావో, చివరివరకూ ఇలాగే ఏకటాకీని గడుస్తుందని ఏంచెప్పగలం?' అని చెప్పి తనదారిని తను వెళ్ళిపోయాడు.

''ప్రభూ, ఈ ముసిలివాని గడ్డంచూసి మోసపోయి తమరు వానికి తగనిమర్యాదలు చేశారు. 'ఎద్దుకేం తెలుసు అటుకుల రుచి?' అన్నట్టు తమయొక్క వైభవం, సౌఖ్యం, వీడికేం తెలుసు? సుఖి యెవరూ అంటే

చెప్పవచ్చు' అన్నాడు. 'ప్రతాపుడా? ఎవరాతడు? అతని పేరెప్పుడూ నేను వినవే లేదే? అటువంటి అనామకు డొకడు నాకన్నా సుఖి అంటే ఆశ్చర్యంగా వున్నదే!' అన్నాడు రాజు.

''ప్రతాపుడు నీకుమల్లే పేరు ప్రతిష్ఠలు సంపాదించనిమాట నిజమే. కాని 'సుఖి' అని మాత్రం అనిపించుకున్నాడు. కష్టపడి సంపాదించుకుని కడుపునిండా తిన్నాడు. కొడుకులనూ కూతుళ్ళనూ కన్నాడు. మనుమల్ని ఎత్తుకున్నాడు. ఏ ఒడుదుడు కులూ లేకుండా అరవయ్యేళ్లు బ్రతికి, చివ రికి మాతృదేశంకోసం యుద్ధంచేసి వీర స్వర్గం పొందేడు' అని చెప్పాడు జ్ఞానధని.

ముహూర్తానికి పుష్కలమహారాజుగారే! పుష్కల మహారాజుకీ జై!' అంటూ చుట్టూవున్న వాళ్ళంతా ఒక్కమారు ఆయనను స్తుతిచేసి సంతోషపెట్టేరు. జ్ఞానధని చెప్పినదిఅంతా ఒక పీడకలగా భావించి, రాజు ఆ మాటలే మరిచిపోయాడు.



*　　*　　*

సంవత్సరం గడిచింది. అంతఃపురంలో రాజు గాఢంగా నిద్రిస్తున్నాడు. 'శత్రువులు! శత్రువులు !!' అన్న కేకలు వినపడ్డాయి. ఉలిక్కపడి లేచాడు. 'ప్రభూ, సామంత రాజు మహాబలుడు సేనతో కోటను చుట్టుముట్టేడు. మనవాళ్ళు నిలబడి యుద్ధం చేస్తున్నారే కాని లాభంలేదు' అన్నారు రాజభటులు.

మరోక్షణానికి 'మహాబల మహారాజుకీ జై' అంటూ శత్రుసైనికులు కోట ప్రవేశించటం పుష్కలుడే చూశాడు.

ఇంక ఒక్క క్షణంసేపు ఉపేక్షచేసినా ప్రాణాలు దక్కవని, తన రాజదుస్తులకు మారు మామూలుదుస్తులు వేసుకొని ప్రాణం కాపాడుకోడానికని ప్రయత్నించాడు రాజు. 'ఎవడో పారిపోతున్నాడు, పట్టుకోండ్రా' అన్నాడు శత్రువులతరఫు సేనాని. అతడు పుష్కలుడన్న సంగతి తెలియక ఎవడో సామాన్యుడనుకొని శత్రుసైనికు డొకడు నరికెయ్యటానికే కత్తియెత్తేడు. పుష్కలుడు, 'ఇంక బ్రతకటంకన్న చావటమే మేలు' అనుకుని, 'ఏదీ, చంపు' అంటూ ధైర్యంగా ఎదట నిలబడ్డాడు.

కాని ఆయనవెంట రెండవ కుమారుడు ఉన్నాడు. అతడు మూగవాడు. తండ్రికి రాబోతూన్న అపాయాన్ని చూచి 'నా తండ్రి! పుష్కల మహారాజు! చంపకండి!' అని చెప్పబోయాడు. చిత్రం! అతనికి ఆ గాభరాలో నోరు పెగిలి మాటే వచ్చేసింది! చంపటానికి కత్తిఎత్తిన సైనికుడు ఆగిపోయి పుష్కలుణ్ణి బంధించి తీసుకుపోయి మహాబలుడిముందు నిలబెట్టేడు.

"శత్రుశేషం ఉండరాద"నిచెప్పి, మహాబలుడు 'కాల్చి చంపండి' అని ఆజ్ఞాపించాడు.

ఎండిన పుల్లలు తెచ్చి చితి పేర్చారు. చితిమధ్యన పుష్కలుణ్ణి నిలబెట్టేరు. అంతా చూడటానికి వచ్చారు. వాళ్ళలో పుష్కలుణ్ణి వెనక పొగిడినవాళ్లుకూడా చాలామంది వున్నారు.

పుష్కలుడు ఒక్కమారు చుట్టూ పరికించాడు. కోట, రాచనగరు ఉద్యానవనాలు—ఒక్కొక్కటే కనపడ్డాయి. "ఇప్పుడు అవేవీ నావి కావు! ఎంతలో ఎంత మార్పు? ఇంత బతుకూ బతికి ఎటువంటి దారుణ మరణానికి పాల్పడుతున్నాను! జ్ఞానధని చెప్పిన మాటలు అక్షరాలా నిజం! 'ఏదీ శాశ్వతంకాదు. జీవితం ముగిసేవరకూ సుఖి ఎవడో, దుఃఖి ఎవడో, నిర్ణయించటానికి వీల్లేదు!'—ఈ మాటలు బంగారు తునకలు" అనుకొంటూ ఆయన కంటనీరు పెట్టుకున్నాడు. ఇంతలో చితికి నిప్పు అంటించారు.

దుఃఖం ఆగక, "జ్ఞానధనీ, జ్ఞానధనీ" అని ఏడవసాగాడు రాజు. మహాబలుడికి ఇది వినపడి, "జ్ఞానధని ఎవరు?" అని అడిగాడు.

అక్కడ ఉన్నవాళ్లు జరిగిన సంగతంతా విప్పి చెప్పేరు. మహాబలుడు ఆలోచనలో పడ్డాడు. 'నిజమే చూడగా, ఎప్పటికి ఎవడి స్థితి ఎలామారుతుందో ఎవడు చెప్పగలడు? ఈ క్షణంలో గొప్పవాణ్ణి అనుకొంటూవున్న నాకు ముందు ముందు ఏమి రాసిపెట్టి వుందో!... ఈ పుష్కలుని ప్రాణం తీయటానికి నేనెవరిని?' అనుకుని, పశ్చాత్తాపం చెందాడు.

వెంటనే మండుతున్న చితిని ఆర్పించి, పుష్కలుని ప్రాణం నిలబెట్టేడు.

అంతేకాదు. పుష్కలుణ్ణి ఎంతో మర్యాద చేసి, అతనితో వైరం మానివేసి, మాళవ రాజ్యం మళ్ళీ అయనకు ఇచ్చివేశాడు.






రావులపాలెంలో భద్రయ్య కరణాల పిల్ల వాడు. వాడికి పధ్నాలుగేళ్ళ వయస్సు. ఇంకా పెళ్ళికాలేదన్న తొందర వాణ్ణి చిన్న తనంలోనే పీడించింది. వాడి పెత్తల్లి కుమారుడు కిష్టయ్యకీ, మేనమామ కొడుకు భానోజీకీ, మేనల్లుడు లక్ష్మీనరుసుకీ ఎంతో వైభవంగా పెళ్ళిళ్లు జరిగినై.

ఆ పెళ్ళిళ్ళకు వాడు తల్లితో వెళ్ళటం, అక్కడి విందులూ, పల్లకి ఊరేగింపులూ, బంతులాటలూ, దండాడింపులూ వాణ్ణి ఆకర్షించటం—ఇవన్నీ చూడగా తనకి కూడా ఆ మహోత్సవం త్వరగా జరిగితే బాగుండుననీ అనిపించింది.

ఒకనాడు ఉండబట్టలేక వాడు వాళ్ల అమ్మని 'అమ్మా, నాకు పెళ్ళిచెయ్యవా?' అని అడిగేశాడు కూడాను. ఇంతలో పక్కింటి సుభద్ర ఎనిమిదేళ్ళ పిల్ల, అక్కడికి చక్కావచ్చింది.

భద్రయ్య తల్లి గోదారమ్మ 'ఏమే సుభద్రా, మా భద్రయ్యని పెళ్ళి చేసుకుంటావా?' అని మాటవరసకి అడిగింది నవ్వుతూ. సుభద్ర సిసింద్రిలాంటి పిల్ల. 'నే చేసుకోను' అని వెంటనే సమాధానం చెప్పేసింది. 'ఏమే, ఎందుచేత చేసుకోవూ?' అంది గోదారమ్మగారు. 'ఎందు కేమిటి? భద్రయ్య నల్లగా వున్నాడు. నా కక్కర్లేదు' అనేసి తను వచ్చిన పనే మరిచిపోయి ఇంటికి తుర్రుమంది.

భద్రానికి చాలా అవమానమనిపించింది. నిజానికి వాడు నలుపే. ఐతేం? ఉన్నమాట అంటే ఉలుకెక్కువకద!

కొన్నాళ్ళకల్లా వాడు నర్సాపురంవెళ్లేడు. అది వాళ్ల అక్క అత్తారిఊరు. ఆ అక్క పేరు రమణమ్మ. రమణమ్మ మొగుడి పేరు భాస్కరం. ఆయన భద్రయ్యకు మల్లే గాకుండా పచ్చగా పనసతొనలాగ బంగారు

కుమారి రాజామణి - విజయవాడ



చాయతో మెరుస్తూ ఉంటాడు. ఆ బంగారు చాయ చూసేసరికి భద్రయ్యకి ముచ్చటా వేసింది. తనకికూడా అటువంటి చాయ లేదన్న అసూయా కలిగింది.

భాస్కరం భద్రయ్యకంటే చాలా పెద్ద. కనక, వాడికి బావగారివద్ద అట్టే చనువు లేదు. ఐనా వాడు సమయంచూసి మెల్లిగా ఆయన దగ్గరకు జేరి, 'బావా, నీకు ఈ బంగారుచాయ ఎలా వచ్చిందీ?' అని అడిగాడు.

భాస్కరం ఐతే కొంటెమనిషి. అందులోనూ అడిగినవాడు తనకు బావమరిదే గనుక వేళాకోళంగా ఇలా చెప్పటానికి ప్రారంభించాడు :

"చాయకేముందోయి భద్రం? నేను చిన్నప్పుడు నీకంటేకూడా నల్లగా ఉండే వాణ్ణి! అందుకే అందరూ నన్ను "నల్ల నేరేడుపండు' అని పిలిచేవారు కూడాను. నువ్వు ఇప్పుడు నన్ను అడిగినట్టే, నేను ఒకప్పుడు మా మామయ్యను అడిగేను. మామయ్య మంచి ఎర్రగా వుండేవాడులే! ఆయన ఆ కిటుకు కాస్తా చెప్పేశాడు!"— అంటూ ఇంతవరకూచెప్పి భాస్కరం పలకకుండా ఊరుకున్నాడు.

అప్పుడు. భద్రం, 'ఏమిటి బావా ఆ కిటుకు ?' అని ఆత్రంతో అడిగేసరికి భాస్కరం ''విను. కానీ ఖర్చులేనిది ఆ కిటుకు.

యెర్రగా కాలిన పండు ఇటుక పొడుంచేసి ఉంచుకొని, రోజూ స్నానంచేసేటప్పుడు ఆ పొడిని డొక్కపీచుమీద వేసి దానితో వళ్లంతా శుభ్రంగా తోముకోడం. అంతే. ఒక్క నాలుగురోజులు ఇలాగ తోముకునేసరికి,నలుపల్లా చామనచాయగా మారి, తర్వాత పసుపురంగు తేలి ఆఖరికి గులాబీరేకల కాంతి చక్కావస్తుంది!" అన్నాడు.

అని, భాస్కరంగారు, 'భద్రం, గ్లాసుతో గ్లాసుడునీళ్ళు తెచ్చిపెడుదూ!' అని

వెనక్కి తిరిగి చూచాడు. తీరా చూస్తే, అక్కడ మరి భద్రం కనిపిస్తేగా?

భోజనాలవేళ అయింది. భద్రం ఇంకా రాలేదు. 'వాణ్ణి ఎక్కడికైనా పంపేరా ఏమిటండీ?' అంది రమణమ్మ. 'లేదు ఊరు చూడ్డానికి వెళ్ళేడేమో, వాడే వస్తాడులే' అంటూ భోజనంచేసి, తొందరగా ఆఫీసుకి వెళ్ళిపోయాడు భాస్కరం.

తమ్ముడికోసం ఎదురుచూసిచూసి, ఎంతకూ రాకపోవడంచేత కంగారుపడి, వెతకటానికని పనిమనిషిని పంపింది రమణమ్మ.

ఆ దాసీది ఊరంతా తిరిగితిరిగి ఆఖరికి చెరువుగట్టుకు వెళ్ళి చూసేసరికి, భద్రం పావంచాలమీద నిలబడి, జబ్బసత్తువంతా వినియోగించి ఇటికపాడితో వొళ్లంతా తోముకుంటూ కనపడ్డాడు. అతన్ని చూసి దాసీది లోలోపల నవ్వుకుంది.

బాబుగారూ!– 'మీకోసమని అక్కయ్యగారు కనిపెట్టుకుని వున్నారు. చప్పున రండి' అనిచెప్పేసి దాసీది వెళ్ళిపోయింది. మరో గంటకికాని వాడు ఇంటికి చేరుకున్నాడుకాదు. 'ఏమిరా తమ్ముడూ, పొద్దున్నే వెళ్ళినవాడవు, ఒంటిగంటదాకా ఏంచేస్తున్నావు?' అంది రమణమ్మ.



అప్పుడు భద్రం తనకు బావచెప్పిన గోసాయిచిట్కా ఆమెకు మెల్లిగా తెలియజేయాలనే వుద్దేశంతో సరియైన సమాధానం చెప్పక, రెండుమెతుకులు నోట్లో వేసుకుని డాబాపైకి చక్కాపోయాడు.

తన దేహకాంతిలో రాబోయే మార్పు కోసం ఎదురుచూస్తో వాడు అలా ఒంటరిగా డాబామీద కూర్చునేసరికి చల్లటిగాలి వీచి, వొళ్లంతా సలపటం మొదలెట్టింది. క్రమంగా సలుపు ఎక్కువై, పులకరం తగిలినట్టయి అక్కడే పరుపుమీద నడుం వాల్చేడు. ఈ సంగతి ఎవరూ గమనించనే లేదు.

సాయంకాలం ఆఫీసునుంచి భాస్కరం వచ్చి, 'ఏడీ భద్రం? వాడిని సినిమాకు

తీసుకువెళదా మనుకొంటున్నాను. అందు కోసమే పెందరాళే వచ్చాకూడా ' అన్నాడు.

మళ్లీ వెతకటం ప్రారంభించారు. భార్యా భర్తలిద్దరూ డాబా మీదకు వెళ్ళి కళ్ళు మూసుకు బాధపడుతూన్న భద్రాన్ని చూసి, 'ఏం నాయనా పడుకున్నావ్?' అన్నారు. జ్వరంతగిలిందేమో అని వంటి మీద తుండుగుడ్డ వత్తిగించి చూసేసరికి, వొళ్ళంతా గీసుకుపోయి ఎర్రగా కనపడింది. రమణమ్మ ఆశ్చర్యపోయింది. భద్రం ఆమెకు సమాధానం చెప్పకుండా భాస్కరంతో 'బావా, నువ్వు చెప్పినట్టే నా వంటి రంగు మారిందిసుమా! అన్నాడు.

'నాలుగురోజులు తోమితేగాని ఈ రంగు రాదన్నావు నువ్వు. అంతవరకూ ఎవడు ఆగుతాడని చెప్పేసి. నేను ఇవాళే నాలుగు ఇటుకలు తెచ్చి పొడుంచేసి, ఇవాళే అంత పొడుమూపెట్టి తోమేసుకున్నాను! వొళ్లంతా ఆ పొడు నలుపు పోయి చక్కటి కమలారెంజిరంగు వచ్చింది. కాదూ?' అంటూ సంబరపడుతూ అడిగాడు.

భాస్కరం జాలిగా నవ్వేడు. అప్పుడు రమణమ్మ 'ఏమిటండీ, ఇటుకపొడుం యేమిటి?' అంది. అందుకు భాస్కరం 'తర్వాత చెబుతాగాని, ముందు కొబ్బరి నూనెసీసా పట్టుకొచ్చి వాడి వంటికి రాయి' అన్నాడు నవ్వుతూ.

ఈ చికిత్స రెండురోజులు చేసేసరికి, భద్రం వంటి సలుపులు తగ్గేయి. కాని, ఎర్రబడ్డ వొళ్ళు తిరిగీ నల్లబడిపోవటం చూసి విచారించి తిరిగీ ఆ గోసాయిచిట్కా ప్రయోగిద్దామనుకున్నాడు వాడు. ఈమాటు భాస్కరమే అడ్డుపడి, 'అది చిట్కా కాదోయ్; వేళాకోళానికి చెప్పేను. ఇంతకీ నువ్వు నల్లగా ఉంటే వచ్చిన లోపమేమిటి! పెళ్ళికాదని భయపడకు! నాకు అమ్మాయి పుడితే నీకేయిచ్చి పెళ్ళిచేస్తా, తెలిసిందా!' అని ధైర్యంచెప్పాడు.






పాపయ్యశెట్టి పరమలోభి. కష్టపడి లక్షలు ఆర్జించాడు. అయితేం, ఆశకు అంతు కనబడలేదు. ఇంకా ఎలా లోకాన్ని కొల్లగొట్టడమా, ఎలా భోషాణం నింపుకోవటమా అనే ఎంతసేపూ ఆలోచిస్తూ ఉండేవాడు.

ఒకరోజున,అతని చిన్ననాటి స్నేహితుడు కోదండపాణి కనపడి పలకరించి, క్షేమ సమాచారాలు చెప్పమని అడిగాడు. అందుకు శెట్టి 'ఏం చెప్పమంటావయ్యా నేస్తం!–ధరవరలు మందగించినై. వస్తువు కొనే నాథుడు లేడు. వర్తకం స్తంభించి పోయింది. ఎప్పటికైనా, దేశంలో కాటకం పడితేకదా వర్తకుడికి పంట,' అంటూ తన బాధలు వెల్లడించాడు.

అప్పుడు కోదండపాణి "పాపయ్యా!— ఇంత అనుభవం గడించావన్నమాటేకాని, ఈపాటిదానికే అంత ఇదైపోతున్నావేమిటి? నా సంగతి తెలుసునో లేదో, ఈమధ్య మలయాళదేశం వెళ్ళి మహామంత్రాలన్నీ నేర్చుకుని యిప్పుడే వచ్చాను. మలయాళ మంత్రాలంటే సామాన్యమనుకున్నావా యేం. పిలిస్తే పలుకుతై. అయితే— యిప్పుడు నీకు, దేశంలో కాటకం పట్టిస్తే సరిపోతుందా? ఒక్క ఈ దేశంలోనే కాదు, కావాలంటే లోకమంతటా పట్టించగల. చూదుగాని, నా మజాకా' అన్నాడు.

ఈ మాటలకు శెట్టి పొంగిపోయాడు. 'నిజంగానేనా కోదండపాణీ!—నిజంగా మంత్రంకట్టి మనరాజ్యంలో కాటకం పట్టించగలవా? అలాగే చెయ్యగలిగిననాడు నీకు లక్షరూపాయలు బహుమతి చెయ్యక పోతానా?' అన్నాడు.

అనేసరికి, 'మాటలెందుకు పాపయ్యా!- దినుసులన్నీ గుత్తకొని, గొదాముల్లో నిలవ వేయించు. తరవాతసంగతి నేను చెబుతాగా! వాగ్దానంమట్టుకు మరిచిపోకు

జె. రాధ - చిట్రగుంట



సుమా!—ఇక చూచుకో నా తడాఖా' అని చెప్పి వెళ్ళిపోయాడు.

ఇంటికి చేరుకున్న కోదండపాణి ఆ పట్టు పట్టు ఇరవైఒక్కరోజు దీక్షగా కూర్చుని, ఉగ్రమైన జపం ప్రారంభించాడు. ఆఖరున, ఒక జింకను సంపాదించుకువచ్చి, దానిని మంత్రించి వదిలిపెట్టాడు. దాని మెడకు 'ఇది పాపయ్యశెట్టి జింక' అని ఒక బిళ్లకూడా కట్టాడు. ఆ జింక ఇష్టం వచ్చినట్టల్లా రాజ్యంలో తిరుగసాగింది. అది శెట్టిగారిది అని తెలిసి, ఎవరూ ఏమీ అనేవాళ్ళు కాదు.

చిత్రమేమిటో గాని, ఆ జింక మెట్టినంతమేరలో గడ్డిపరకసైతం మొలకెత్తకుండా పోయింది. ఈ విధంగా అది వరసన మూడేళ్లపాటు తిరుగులాడేసరికి, రాజ్యమంతటా కాటకం పట్టేసింది. కరువు బాధ భరించలేక, ప్రజ కటకటలాడిపోయారు.

ఆ జింక పగలల్లా స్వేచ్ఛగా తిరిగి తిరిగి, రాత్రి అయేసరికల్లా వచ్చి, కోదండపాణికి తెలియకుండా అతని యింటిముందే నడుం వాల్చేది. ఇందునించి రాజ్యానికి ఎగ్గు తలపెట్టిన అతడికే దారిద్ర్య బాధ పట్టి పల్లార్చసాగింది. రాజ్యంలో క్షామం ప్రవేశపెట్టి, తనకు ఏమీ లోటులేదని సంతోషిస్తున్న కోదండపాణికి, ఈ విధంగా దారిద్ర్యం పట్టి పీడించేసరికి, కారణమేమిటో ఎంతకూ బోధపడక, అతడు కలవరపడ సాగాడు.

ఒకనాటిరాత్రి, ఏదో సందడి వినిపించగా నిద్రలో వున్న కోదండపాణి గభీమని లేచాడు. చూస్తే, తను వదిలిపెట్టిన జింకే తన గుమ్మంముందు వచ్చి పడుకొనివుంది! 'ఓసీ, నీ తాడుతెగా!—ఏమిటో అనుకున్నాను, ఇదా నా దరిద్రానికి హేతువు! ఇలా ఎన్నాళ్ళాయె వచ్చి పడుకుంటున్నావు భడవా?' అంటూ, కోపంకొద్దీ మూలనున్న శాపాటికఱ్ర తీసుకుని దబదబ దాన్ని

బాదాడు. హడలిపోయి ఆ జింక పరు గుచ్చుకుంది. నాటినుండి అది తిరిగి అతని కంట పడనేలేదు. ఇది ఇలా వుండగా—

అక్కడ—ప్రజల ప్రాణాలు నిలపటాని కని చేసే ప్రయత్నాలలో రాజుగారి ఖజానా అంతా ఖాళీ అయిపోయింది. నిలవలో దమ్మిడీలేదు. ఎటువంటి రాబడికి ఆస్కారంలేదు. ఈస్థితిలో రాజుకు ఏమీ పాలు పోయింది కాదు.

ఇక యిది పనికాదని చెప్పి, రాజూ మంత్రీ రాత్రిపూటల మారువేషాలతో తిరుగుతూ, ప్రజల కష్టనిష్ఠురాలు తెలుసుకోవటానికి పూనుకొన్నారు.

ఈ పరిస్థితిలో—మంత్రాలు నేర్చిన ఆ కోదండపాణి పాపం, మంచం పట్టాడు. ఇందుకు కారణం యేమిటంటే—శెట్టి మాటలు నమ్మి, తన యావచ్ఛక్తీ ధారపోసి కొత్తగా నేర్చుకువచ్చిన మంత్రవిద్యలన్నీ ప్రయోగించి ఆ జింకను వదిలిపెట్టాడు. నిజానికి ఇటువంటి గొప్పవిద్యలు ఏ మహారాజువద్దనో, చక్రవర్తిదగ్గరనో ప్రదర్శించి ప్రజ్ఞకు తగిన బహుమానం పొందవలిసింది. అలాటిది యిప్పుడు—

ఇలా కక్కుర్తిపడటంవల్ల ఎన్నో చిక్కులు వచ్చి మెడకు చుట్టుకున్నాయి: తనవల్ల



క్షామం కలిగిందనే విషయం బయల్పడితే శిక్ష తప్పదు. అవతల శెట్టి ఇస్తానన్న లక్ష రూపాయిలూ వచ్చేమార్గంలేదు. ఇంతకూ, అకారణంగా, రాజ్యంలో ప్రజల ఘోష కంతటికీ తను కారకుడయ్యాడు. ఈ అన్నిటి వల్లా అతని మనసు వికలమై, మంచం పటవలసివచ్చింది.

ఇక, తనరోజులు దగ్గరపడ్డాయని నిశ్చయం తోచి, భార్యతోటి ఒకనాడు చెప్పాడు: 'దేశంలోపట్టిన ఈ క్షామాని కంతటికీ కారణం నేను. డబ్బుకు ఆశపడి నేనీ పాడుపని చేశాను. నా ప్రజ్ఞఅంతా వృథా ఐపోయింది. చివరకు దమ్మిడి ముట్టకుండా పోయింది. పైగా శిక్ష కాచుకొనివున్నది.



చేతులారా చేసుకున్న దాని ప్రతిఫలమే నేనిప్పుడు అనుభవించేది. నువ్వొక పని చేయాలి—నేను మంత్రించి విడిచిన జింకను నీ వెప్పుడైనా చూచావంటే దాని కొమ్ముకు రక్షరేకు, దానిలోపల ఒకచీటి కనబడతై. ఆ చీటి ఒక బావిలో పడవేస్తే వెంటనే వర్షంకురిసి, కాటకం నిలిచిపోతుంది. ఉసూరుమంటున్న ప్రజలు సంతోషిస్తారు. అప్పుడుగాని నాకు మనశ్శాంతి కలగదు' అనిచెప్పి వలవల యేడ్చాడు. ఈ మాటలన్నీ శ్రద్ధగా విన్నదామె.

* * *

ఒకరోజున రాత్రి రాజూ మంత్రీ నగరమంతా తిరిగి ఊరిచివరకు వచ్చేసరికి ఒక పూరిగుడిసె కనపడింది. ఆ గుడిసెలో ఎవరో తమ జీవితంలోని కష్టసుఖాలను గురించి వలపోసుకుంటున్నారు: 'మన రాజ్యమేలే రాజు ధర్మప్రభువాయెనే. ప్రజలనందరినీ కన్నబిడ్డలకంటె ఎక్కువగా చూచుకొంటున్నాడే. మరి, అకస్మాత్తుగా ఇప్పుడీ కాటకం ఎందుకు పట్టినట్టు? పాపం పండితేగాని ప్రజలందరకూ ఒక్కమారుగా ఇటువంటి దారుణబాధ సంభవిస్తుందా? మనం ఏంపాపం చేసుకున్నాం? దీనికి ఏనాటికైనా విరుగుడు వుందా? మన కష్టాలు ఎప్పటికైనా గట్టెక్కే మార్గం వుందా, లేదా?' అనేమాటలు వినిపించినై. ఈమాటలు వినేసరికి రాజుగుండె తల్లడిల్లిపోయింది. ఏమీ తోచక ఆయన నిశ్చేష్టుడై నిలబడిపోయాడు.

ఆ సమయంలో అకస్మాత్తుగా రాజుకేదో చేతికి తగిలింది. ఏమిటా అని పట్టుకోబోయేసరికి, చేతిలో ఏదోగాని చిక్కుకున్నట్టుంది.

దానిని దీపంవెలుగున చూడగా, అది ఒక రక్షరేకు. విడగొట్టిచూస్తే, అందులో ఒక కాగితం. ఆ కాగితంలో ఇలా వ్రాసివున్నది: 'ఈ చీటిని ఊరిచివర బావిలో పడవేసినట్టయితే, దేశానికి పట్టిన క్షామం నివారణవుతుంది' అని.

ఇది చూచీమూడటంతో రాజుకు పట్ట రాని సంతోషమూ ఆశ్చర్యమూ కలిగినై. దగ్గరనే ఒక నూతివద్దకు గబగబ వెళ్ళి ఆ చీటీ అందులో పడవేశాడు.

వేసివేయగానే దట్టంగా మేఘాలు కమ్ముకువచ్చి, క్షణీపాతంగా వర్షం కురవ సాగింది. ఇలా హెూరుమని వర్షించే సరికి రాజూ, రాజ్యంలోని ప్రజలుకూడా మితిలేని సంతోషం పొందారు. ఆ వర్షం నుండి తప్పుకొని కోటకు చేరుకోవటాని కైనా రాజుకూ మంత్రికీ సావకాశం లేకపోయింది.

వర్షంలో తడిసి వారు చాలా అలిసి పోయారు. అపరిమితమైన దాహంకూడా వేసింది. ఇక ఆగలేక తలుపుతట్టగా, ఒక యిల్లాలు ఇవతలకు వచ్చి, చీకటిలో తిరుగు లాడుతున్న ఆ బాటసారుల్ని ఆదరించి, తనకున్న గంజినీళ్లతో ఆప్యాయంగా వాళ్లకు ఆతిథ్యమిచ్చింది. వాళ్ళు సంతోషించి, కృతజ్ఞత తెలిపి, మళ్లీ తమ పనిమీద తాము బయలుదేరారు.

వర్షం కాస్త వెలియటంతోనే రాజూ మంత్రి కోటకు చేరుకున్నారు. అంతలో గూఢచారులు వచ్చి 'ప్రభూ!—ఊరిచివర, రాత్రి పదీ పదకొండు గంటలప్పుడు



పాపం, ఒక యిల్లాలును భర్త చావ కొట్టుతున్నాడండి—' 'బోలెడంత డబ్బు కర్చుపెట్టి, దేశంలో కాటకం పట్టించటం కోసమని నేను జింకను వదిలిపెట్టిస్తే, నీ మానాన నువు దానధర్మాలు చేస్తావా? నువు వాళ్ళవళ్ళకో గంజి పోయటంచేతనే ఇలా యిప్పుడు వర్షంకురిసింది. వర్షంకురిస్తే కాటకం పోతుంది. కాటకంపోతే మనకు లాభాలేముంటాయి?' అంటూ తిట్టి, కొట్టి, ఆమెను హింసించాడండి' అని చెప్పారు.

ఈమాటలు వినగానే రాజూ మంత్రీ ఆశ్చర్యపోయారు. భటులు చెప్పిన ఆ భర్త ఎవడో వాడిని పిలుచుకురమ్మని ఆజ్ఞా పించారు. వాళ్ళు తీసుకవచ్చారు. చూడగా

అతడే పాపయ్యశెట్టి. తన బండారం బయట పడిపోయిందే అనిచెప్పి, విచారణ జరగక ముందే ఉన్నది వున్నట్టు, జింక చరిత్ర అంతా వినికిడిచేసి ప్రభువువారి పాదాల మీద పడ్డాడు శెట్టి.

రాజు ఉగ్రుడై, స్వలాభంకోసమని ఇటు వంటి దారుణపుపని తలపెట్టిన శెట్టికి ద్వీపాంతర శిక్ష విధించాడు. నిమిషంలో ఈవార్త నగరమంతా అల్లుకుపోయింది.

పాపయ్యశెట్టి చేసిన దురంతానికి ప్రజలందరూ ఆవేశపడి, వాడిని ఏమిచేసినా పాపంలేదన్నారు. రాజువేసిన శిక్ష చాలనే చాలదన్నారు. ప్రజలందరూ సంతోషిస్తూ ఉంటే, ఒకే ఒక వ్యక్తి విచారపడింది.

ఆ వ్యక్తే ఊరిచివర పూరిగుడిసెలోని యిల్లాలు. ఉరకలేసుకుంటూ పోయి ఆమె రాజుకు మ్రొక్కింది.

ఆమెను చూడగానే, రాత్రిపూట తమను సత్కరించింది ఈ యిల్లాలే అని గుర్తించి, రాజు ఎంతో అప్యాయంతో ఆమెను ఆదరించాడు. యిష్టంవచ్చిన బహుమతి కోరుకోమన్నాడు. అందుకామె పట్టరాని దుఃఖంతో 'ప్రభూ!—మీరు శిక్షించిన ఆయనే నా భర్త. నా భర్తను రక్షించుకోవటంకంటె నాకు కావలిసిందేమీ లేదు. క్షమించండి. దయవుంచండి' అన్నది. ప్రభువు మనసు కరిగిపోయింది.

ఆమెకుగల పతిభక్తికీ, పరోపకారదీక్షకూ సంతోషించి రాజు ఆమెను భర్తతో సహా యింటికి పంపించివేశాడు.

*  *  *

అటుతరవాత,—ప్రమాదకరమైన ఇటువంటి మంత్రాలు నేర్చిన ఆ కోదండపాణిని ఉన్నవాడిని ఉన్నట్టుగా పట్టి తెమ్మని అజ్ఞాపించాడు రాజు. గబగబ వెళ్లారు భటులు. ఐతే, వాళ్ళు వెళ్ళేసరికే ఆ మళయాళ మంత్రగాడు తన గదిలో గుండెపగిలి చచ్చిపడివున్నాడు!






పూర్వం కాణాసదేశంలో ఏకవీరుడనే రైతు ఉండేవాడు. వానికి ఇద్దరు భార్యలు. మొదటిభార్యకు పదిమంది కొడుకులు. రెండోఆమెకు ఇద్దరు కొడుకులు. ఇద్దరిలోనూ పెద్దవాడు యశోవంతుడు, రెండోవాడు మంజులాంగుడు. ఏకవీరుడికి వీళ్ళిద్దరిపైనా మక్కువ ఎక్కువ.

యశోవంతుడికి పదహారేళ్ల ప్రాయం. మంజులాంగుడింకా పసివాడు. యశోవంతుడికి సవతి అన్నలంటే గౌరవం. వాళ్లకు మాత్రం యశోవంతుడంటే మత్సరం.

యశోవంతుడు ఒకనాడు తనకు వచ్చిన ఒక కలనుగురించి అన్నలతో చెప్పాడు. ఉన్నది ఉన్నట్టు చెప్పగానే, మూర్ఖతవల్ల వాళ్లు అపార్థంచేసుకుని, పగపూనారు.

ఇలా వుండగా—

ఏకవీరుడి మైదానంలోని పచ్చిక పూర్తికావచ్చింది. అందుచేత పెద్దకొడుకులు పదిమందినీ పిలిచి, "పశువుల్ని తోలుకొని మీరు మరో మైదానానికి వెళ్ళండి. ఇక్కడ గడ్డి శీదాగా ఐపోవడంతో మేమూ బయలుదేరి వస్తాం" అని చెప్పి పంపేడు. వాళ్లు పదిమందీ వెళ్లి ఒక కొత్తమైదానంలో మకాంచేసి పశువుల్ని మేపుకొంటున్నారు. తండ్రికిమాత్రం వర్తమానం ఏమీ తెలియచేశారుకారు. వాళ్ల కబురేమీ తెలవకపోవడంవల్ల ఏకవీరుడు ఒకరోజున యశోవంతుణ్ణి పిలిచి, "అన్నలెక్కడున్నారో చూసిరా నాయనా" అని పంపేడు.

యశోవంతుడు బయిల్దేరివెళ్లాడు. వాణ్ణి చూడ్డంతోనే అన్నలు చుట్టుముట్టేసి, "ఏమిరా వచ్చావ్? కొత్తకలలు ఏమైనా కన్నావా? మాకూ ఒక కల వచ్చింది, విను: వంటింట్లోకి కుందేలు వచ్చిందిట. నువ్వు మాదగ్గిరకి వచ్చావుట. నిన్ను మేం కట్టేసి తెల్లవారేలోపుగా ఇలా చంపేశాముట!"

పాలంకి వెంకటరామచంద్రమూర్తి - మదరాసు




ఆ రాజుకికూడా ఒకప్పుడు చిత్రమైన ఒకకల వచ్చింది: 'పచ్చిక బయలు. పక్కన నది. ఆ నదిలోంచి వరసగా ఏడు ఆవులు పైకివచ్చి బయలులో విచ్చలవిడిగా మేస్తున్నాయి. అవి బాగా బలిసి పుష్టిగా ఉన్నాయి. మరికాస్సేపటికి ఆ నదిలోంచే మరో యేడు ఆవులు ఆ మైదానంలోకి వచ్చాయి. ఆ ఆవులు ఏడూ పొదుగులే లేక ఎండిపోయి ఉన్నాయి. ఆ బక్క ఆవులు యేడూ చేరి మొదట వచ్చిన పుష్టిగోవులు యేడింటినీ మింగేశాయట!'

ఇదీ రాజుకు వచ్చిన కల.

రాజు జ్యోతిష్కుల్ని రప్పించి అడిగాడు. ఎన్ని శాస్త్రాలు తిరగవేసినప్పటికీ, కల అర్థం పండితులు ఎవరూ చెప్పలేకపోయారు. చివరకు, యశోవంతుడిని అడిగారు.

ఆతడు 'ప్రభూ—మీకువచ్చిన ఈ స్వప్నం చాలా చిత్రమైంది. దీనిద్వారా భగవంతుడు మన రాజ్యానికి రాగల భవిష్యత్తునుగురించి సూచించాడన్న మాట. మొదటవచ్చిన యేడు పుష్టిగల ఆవులూ రాబోయే ఏడు సంవత్సరాలు. ఈ యేడు సంవత్సరాలలో దేశంలో పుష్కలంగా పంటలుపండేస్తాయి. తర్వాత ఏడుసంవత్సరాలలోనూ గొప్ప కరువు పట్టబోతుంది.

అని చెబుతూ, బలవంతాన వాణ్ణి బంధించి, చంపుదామని మోసుకుపోయారు.

వాళ్ళకి దారిలో బానిసవర్తకులు ఎదురయారు. ఆ వర్తకుల్ని చూసేసరికి వాళ్లకి "వీణ్ణి చంపేస్తే ఏంలాభం? బానిసగా అమ్మేస్తే సొమ్ము వస్తుందే!" అని తోచింది.

అప్పుడు వాళ్ళు ఆ బానిస వర్తకుల్ని నిలబెట్టి యశోవంతుణ్ణి ఇరవై మొహిరీలకు అమ్మివేశారు. వర్తకులు యశోవంతుడి రెండు చేతులకీ తాడుకట్టి, ఈడ్చుకుపోయారు.

ఆ వర్తకులు యశోవంతుణ్ణి మైనాక ద్వీపానికి తీసుకుపోయి అక్కడ రాజుకి బానిసగా అమ్మేశారు.

ఎలా అంటే: మొదట వచ్చిన పుష్టిఅవు లనగా సుఖం. ఆ సుఖాన్నంతటినీ తరువాత వచ్చిన కష్టం కబళించేస్తుంది. కనుక మనం జాగ్రత్తపడాలి' అన్నాడు.

కలవరపాటుతో, చక్రవర్తి 'యశోవంతా, నేను పడవలసిన జాగ్రత్త యేమిటో అదీ నువ్వే చెప్పు' అన్నాడు.

అప్పుడు యశోవంతుడు బాగాఆలోచించి, రాజ్యంలో పండే తిండిగింజలను వీలైనంత వరకు ప్రభుత్వం నిలవచెయ్యాలనీ, ప్రజ పొదుపుగా వాడాలనీ చెప్పి, ఇందుకు అవ సరమైన కొన్ని చక్కటి సూత్రాలుకూడా సూచించాడు.

యశోవంతుని మెచ్చుకుని రాజు తన ప్రధానిగా నియమించి, కరువుకాటకాల నుండి ప్రజలను తప్పించే భారం అతని మీదనే పెట్టాడు.

అక్షరాలా యశోవంతుడు చెప్పినట్టే జరిగింది! మొదట అపరిమితంగా పంట పండేసింది. ప్రజలు తిన్నంత తిని పారేసి నంత పారెయ్యబోయారు. కాని యశోవం తుడు ఒక్కగింజకూడా వృధాకానియ్యక, ప్రజల తిండికి ఎంతకావాలో అంతమా త్రమే ఇచ్చి, మిగతా అంతా రాజుగారి గాదెలలో నింపి నిలవవేశాడు.




ఏడుసంవత్సరాలూ సుభిక్షంగా ఇట్టే గడిచిపోయాయి. అవెనుక, కరువు దాప రించింది. ఆకలితో ప్రజలు హాహాకారాలు మొదలెట్టేరు. యశోవంతుడు అందరకూ ధైర్యంచెప్పి, అనేకవిధాల సాయం చేస్తూ వచ్చాడు.

ఈ కరువు చుట్టుపక్కల వుండే అన్ని దేశాలకీ వచ్చిపడింది.

ఐతే, వాళ్ళెవరూ ముందుజాగ్రత్త ఎంత మాత్రమూ పడలేదు. మైనాకద్వీపంలో ధాన్యం నిలవవున్నాయని తెలవటంతో అంతా అక్కడికి పోయి యశోవంతుణ్ణి ప్రాధేయపడ్డారు. అందరకూ లేదనకుండా ఇవ్వగలిగాడు యశోవంతుడు.



యశోవంతుడి జన్మభూమి ఐన కాణాన దేశంనుంచికూడా ధాన్యంకోసం ప్రజలు సంచీలు పుచ్చుకువచ్చారు. ఆ వచ్చిన వాళ్ళల్లో అతని సవతి అన్నలు కూడా ఉండటం తటస్థించింది. ఏకవీరుడే వాళ్ళని పంపేడు.

అతడు మంజులాంగుణ్ణి మాత్రం పంపలేదు. ఏమంటే, యశోవంతుడు చనిపోయూ డనుకున్నప్పట్నుంచీ, ఏకవీరుడు కడసారివాడైన మంజులాంగుణ్ణి నిముషం కూడా వదలిపెట్టి ఉండేవాడుకాడు.

సవతి అన్నలు యశోవంతుణ్ణి ఆనవాలు పట్టలేకపోయారు. అతడీపాటికి ఎక్కడో చచ్చిపోయేవుంటాడని వాళ్ళతలంపు. యశోవంతుడు మాత్రం అన్నల్ని ఇట్టె ఆనవాలు కట్టేశాడు. వాళ్ళు పదిమందీ కలిసి, "ప్రభూ! గింజలు లేక మాడిపోతున్నాం! సొమ్ముతెచ్చాం. మా ప్రాణాలు నిలబెట్టండి!" అంటూ, అతనికి సాష్టాంగపడ్డారు. విధివిధానానికి ఆశ్చర్యపోతూ యశోవంతుడు క్షణంసేపు వాళ్లకేసి చూస్తో అలాగే ఉండిపోయాడు.

వాళ్ళు పరాయిదేశస్థులు కావటంచేత వారిని అనుమానిస్తున్నట్టుగా నటించాడు యశోవంతుడు.

అందుకు వారు "మహాప్రభూ! ఏ ఒట్టు పెట్టుకోమంటే ఆ ఒట్టు పెట్టుకుంటాము. మేము చారులంకాదు. కాణాన దేశపు రాజైన ఏకవీరుని కుమారులం. అసలు మేము పన్నెండుగురం. మాతమ్ముల్లిద్దరిలో ఒకడు పోయాడు. రెండోవాడు మంజులాంగుడనేవాడు మా నాయనవద్దనే ఉన్నాడు. నమ్మండి ప్రభూ!" అని శతవిధాల గోలపెట్టేరు.

యశోవంతుడు కోపంనటిస్తో "నమ్మను! ఆ మంజులాంగుడెవడో తీసుకొచ్చి నాకు కనపరిస్తేనే నమ్ముతాను! అంతవరకూ మీలో ఒకడు మారాజ్యంలో ఖైదీగా ఉండాలి! మీలో తక్కిన తొమ్మండుగురికీ



ధాన్యం ఇప్పిస్తాను. తీసుకపొండి" అన్నాడు. చేసేదిలేక అన్నలు తమలో ఒకణ్ణి శాకట్టుగా వదిలిపెట్టిపోవటానికి పప్పుకున్నారు.

రాజభటులు వాళ్ళ సంచీల నిండా ధాన్యం నింపేరు. మూతులు బిగించే ముందు వారు చెల్లించిన సొమ్ము కూడా వాళ్ళ సంచీలలోనే పెట్టేసి కట్టేశారు. ఇది యశోవంతుడి ఆజ్ఞ. అన్నలకీసంగతి తెలవనే తెలవదు.

ఆ తొమ్మండుగురూ బస్తాలను గాడిదల పైన ఎక్కించుకుని పోయి, దారిలో వాటికి దాణాపెడదామని సంచులు విప్పే సరికి వాటిల్లో సొమ్ము కనపడింది! ఇది చూడగానే వాళ్ళు కంగారుపడ్డారు. ఇలా తాము చెల్లించిన సొమ్ము మళ్ళీ తమ సంచీలలోనే ఉండిపోపటం పొరపాటేమో! మొదటనే రాజు తమను అనుమానించాడాయె.

అందుకు తోడు ఇలా జరగటం వాళ్ళని మరింత కలవరపరిచింది. ' సరే కానీ, మళ్ళీ ఎలాగూ రావాలికదా, అప్పటికి పరిస్థితి ఎలామారుతుందో చూచుకొందాం' అనుకొని, సాగిపోయారు.

ఇంటికి చేరుకోగానే జరిగినదంతా వారు తండ్రితో పూసగుచ్చినట్టు చెప్పేరు. వాళ్ళ మాటలు వినగానే వీకవీరుడికి దుఃఖం పొంగిపొరలి వచ్చింది. కోపమూ వచ్చింది. 'పదిమందీ కలిసి అనాడు యశోవంతుణ్ణి క్రూరమృగాలవాత పడేశారూ! ఇప్పుడు కడసారి వాణ్ణి కూడా తీసుకుపోతారూ? ముందుగా నన్ను చంపి, మరీ వాణ్ణితీసుకుపొండి!" అన్నాడు ఎంతో ఆవేశంతో.

అనాడు యశోవంతుడికి తాముచేసిన అపచారానికి వడ్డీతోసహా శాస్తి జరుగుతోందని వాళ్ళు లోలోపలే కుమిలిపోయారు. "నాయనా, జరిగిందేదో జరిగింది. నీవు ఆ విషయాలన్నీ మరిచిపోవాలి. లేకుంటే దిగడిపోయిన తమ్ముణ్ణి విడిపించుకురావద్దా, ముందుముందు మనకు ధాన్యం కావద్దా?




ఇందుకుగాను మంజులాంగుణ్ణి ఒక్కమారు అదేశం తీసుకువెళ్లక తప్పదు. జాగ్రత్తగా తీసుకెళ్ళి జాగ్రత్తగా తీసుకు వచ్చేస్తాం' అంటూ నమ్మబలికారు.

'సరే' నన్నాడు ఏకవీరుడు.

మంజులాంగుణ్ణి వెంటబెట్టుకుని సవతి అన్నలు తొమ్మండుగురూ మైనాకద్వీపం చేరుకున్నారు.

అక్కడ తాకట్టుగా నిలిచిపోయి వున్న తమ సోదరుడికి ఆ రాజ్యంలో అడుగులకు మడుగులొత్తుతున్నారని తెలుసుకొని అమిత ఆశ్చర్యపోయారు.

వారు వచ్చారని తెలియటంతోనే యశోవంతుడు వారిని లోపలికి రమ్మన్నాడు. ఆ రోజున పంచభక్ష్యపరమాన్నాలతో వాళ్లందరకూ విందు ఏర్పాటుచేయించాడు.

వరసగా పన్నెండుపీటలు వేయించాడు. యశోవంతుడు మొదటి పీటమీద పెద్దన్ననీ, తరవాత రెండోవాణ్ణీ, అలాగే పదిమందినీ వరుసగా కూచోమన్నాడు. ఇలా చేసేసరికల్లా ఆ అన్నదమ్ములు "మనలో ఎవరు పెద్దో ఎవరు చిన్నో ఈయనకి ఎలా తెలిసిందీ?" అని ఎంతో ఆశ్చర్యపోతూంటే, యశోవంతుడు పదకొండోపీటపైన తను కూర్చుని, తనపక్క పన్నెండోపీటమీద మంజులాంగుణ్ణి కూచోబెట్టుకున్నాడు.

ముఖ్యంగా తన తమ్ముని భోజనం విషయంలో శ్రద్ధ కనపరుస్తూ, తన తిండి మాటే మరిచిపోయాడు యశోవంతుడు. అన్నలంతా ఆశ్చర్యంతో ఆనందంతో ఉక్కిరిబిక్కిరైపోయారు.

"ప్రభూ, తెల్లవారుఝామునే మేం మా దేశం వెళ్లిపోతాం. మా తండ్రి ఈ పసివాణ్ణి విడిచి ఉండలేడు!" అన్నారు అన్నలు. తండ్రి అనేమాట చెవినిపడటంతోనే యశోవంతుడికి కళ్ళమ్మట నీళ్లుతిరిగాయి. "ఆయనకూడా వీళ్లతో వస్తే ఎంత బాగుండిపోను!" అనిపించిం దాతడికి.

అప్పుడు ఆలోచించి, "సరే వెళ్ళండి" అన్నాడు. అన్నలు ధన్యవాదాలు చెప్పుకొన్నారు.

యశోవంతుడు రాజభటుల్ని రహస్యంగా పిలిచి, "వీళ్లు తెచ్చుకున్న పదకొండు సంచుల్లోనూ మళ్ళీ ధాన్యం నింపండి. ఇదివరకుమల్లేనే వీళ్ల సొమ్ముల్ని మళ్ళీ సంచీమూతుల్లో పెట్టి కట్టెయ్యండి. మరో పనిచెయ్యాలి. మంజులాంగుడు పాయసం తాగిన ఆ బంగారు పాత్రనుకూడా వాడి సంచీలో వేసి కట్టెయ్యండి" అని ఆజ్ఞాపించాడు. ఆ ప్రకారమే చేశారు భటులు.

అన్నాదమ్ములు నగరం దాటారో లేదో, గుఱ్ఱాలమీద రాజభటులు చక్కావచ్చి, "ఆగండి!" అని గద్దించారు. అన్నలు నిర్ఘాంతపోయి, "మమ్మల్ని ఆగమంటారేమిటి? మాకు మీ మంత్రిగారు నిన్నరాత్రి విందుచేసి మర్యాదచేసినసంగతి తెలియదా!" అని ఎదురుప్రశ్న వేశారు.

అప్పుడు అక్కడవున్న రాజభటులు వేగిరపడుతూ సంచీలన్నీ ఒక్కొక్కటే విప్పి, సోదాచూచి, మంజులాంగుడి బస్తాలోంచి బంగారుపాత్ర తీసి చూపారు. అన్నలూ మంజులాంగుడూకూడా నిశ్చేష్టులై నిల



బడ్డారు. ఏమైతేనేం, మంజులాంగుడికి బేడీలు తగిలించి లాక్కుపోయారు.

పదిసంవత్సరాల క్రిందట యశోవంతుణ్ణి బానిసవర్తకులు ఇలాగే లాక్కుపోయారు. ఇప్పుడు మంజులాంగుణ్ణి లాక్కుపోవటం చూస్తే ఆనాటి యశోవంతుడు జ్ఞాపకానికి వచ్చాడు వాళ్లకి. అయితే, ఇప్పటిపరిస్థితులే వేరు.

నాటికిమల్లే ఇప్పుడు వాళ్లు మంజులాంగుణ్ణి వదిలిపోవటానికి ఎంతమాత్రం వీలులేదు. అందుచేత పదిమందీ వాడివెనకాలే పరుగులెత్తేరు. వెళ్లి, యశోవంతుడి పాదాలపై పడి, "ప్రభూ, బంగారుపాత్ర మావాడి సంచీలోకి ఎలా వచ్చిందో మాకు

తెలీదు. వీడు కక్కూర్తిపడేవాడుకాడు. తరువాత తమ దయ" అంటూ ప్రార్థించారు.

అప్పుడు యశోవంతుడు, "మీరు వెళ్ళిపోవచ్చు. దొంగ సొత్తుతో దొరికాడు కనుక వీణ్ణే శిక్షిస్తాను! తక్కినవాళ్లతో నాకు పనిలేదు" అన్నాడు. వాళ్లు గొల్లుమంటూ, "ప్రభూ, మేం పదిమందీ నీ పాదసేవకులమై ఇక్కడే వుండిపోతాం. మంజులాంగుణ్ణి తీసుకువెళ్లకుండా వృద్ధుడైన మా తండ్రికి మా మొహాలు కనపరచలేము! తండ్రిపట్ల మేం ఇప్పటికే చాలా అపచారం చేశాం. మంజులాంగుడిపైన ఆయన పంచప్రాణాలూ పెట్టుకుని బతుకుతున్నాడు. ఇప్పుడు వాడు మాతో రాలేదని తెలుస్తేచాలు, ఆయన గుండెపగిలిపోతుంది! ప్రభూ, మేం దోషులం! మహా పాపులం. నీయిష్టం వచ్చినట్లు మమ్మల్ని శిక్షించు! మంజులాంగుడు నిరపరాధి. వాణ్ణిమాత్రం వదిలిపెట్టు!' అని కాళ్ళావేళ్ళాపడి బతిమలాడుతూ, తాముచేసిన తప్పిదాలన్నీ దాచకుండా వెల్లడించారు.

యశోవంతుడి హృదయం కరిగి, కళ్ళమ్మట జలజలమని బాష్పాలు రాలినై. భటులందరనూ పొమ్మని సౌజ్ఞవేశాడు. వాళ్లు విస్తుపోయారు. మంజులాంగుడు మటుకు అన్నను పోల్చేసి, పోయి గట్టిగా చుట్టబెట్టుకున్నాడు. అప్పటికీ గుర్తించలేకపోయారు తక్కిన అన్నదమ్ములు. యశోవంతుడు తన మంత్రివేషం విప్పివేసి మామూలుగా కనిపించేసరికి, అప్పుడు కనిపెట్టగలిగారు వాళ్ళు. సిగ్గుతో బిక్కచచ్చివున్న అన్నలను యశోవంతుడు ఓదార్చి, గతం మరిచిపొమ్మన్నాడు.

నిజానిజాలు వెల్లడి అయినై. ఏకవీరుడూ, తక్కిన అందరూ ఇక్కడికే వచ్చేసి సుఖంగా వుంటున్నారు. చిన్ననాడు యశోవంతుడికి వచ్చిన కల ఈవిధంగా ఫలించటంతో అందరూ విస్మయం పొందారు.






అనంతపురంలో అశ్వద్ధనారాయణ అనే సావుకారూ, భూపతిఅనే కాపూ ఉండేవారు. భూపతి ఒకనాడు సావుకారును పాతిక రూపాయలు చేబదులు కోరుతూ, నాలుగు రోజుల్లో బాకీ తీర్చేస్తానన్నాడు. సావుకారు సరేనని ఇచ్చాడు. భూపతి చెప్పిన గడువు నాలుగు రోజులు కాదు నాలుగేళ్లూ గడిచినై, బాకీ తీర్చలేదు. 'ఇదిగో ఇస్తాను, అదిగో ఇస్తాను' అంటూ జరుపుకొచ్చాడు.

సావుకారు ఆశ వదులుకొని, వాడెప్పుడైనా కనపడినా అడగటమే మానివేశాడు.

మరి కొంత కాలానికి ఒకనాడు సావుకారు ఊళ్ళో ఎక్కడికో వెడుతోంటే టపా బంట్రోతు ఎదురై టెలిగ్రాం అందించాడు. 'తక్షణం బయల్దేరి రావలసింది' అని అతగాడి బావమరిది వాళ్ళ ఊరునుంచి ఇచ్చిన తంతి అది. సరిగ్గా అదేసమయాన అనంతపురంనుంచి ఆ గ్రామానికి వెళ్ళే బస్సుకూడా వచ్చి నిలిచింది. అది తప్పితే మళ్ళీ బస్సులేదు. జేబులో చూసుకుంటే ఒక్కరూపాయా, కొంత చిల్లరా వుంది. 'బస్సు చార్జీమట్టుకి చాలు. వెళ్ళేది అత్తవారిల్లు గనక యిబ్బందివుండదు' అనుకొని అతడు ధైర్యంచేసి ఎక్కేశాడు.

చిత్రం!—ఆ బస్సులోనే భూపతికూడా వున్నాడు. 'ఎక్కడికంటే ఎక్కడికి?' అని ప్రశ్నించుకున్నారు వాళ్ళిద్దరూ. భూపతి యథాప్రకారం, 'మీసొమ్ముకి భయంలేదు సుమండీ, ఇచ్చేస్తాను' అన్నాడు. అందుకు సావుకారు 'ఎప్పుడో కాదు. ఏముంటే అదే ఇప్పుడియ్యి. నేను తలవనితలంపుగా బస్సెక్కి వెళుతున్నాను. చిల్లర కొద్దిగా వుంది' అన్నాడు. 'ఒక్క కానీ కూడా లేదు!' అని ఒట్టువేసుకున్నాడు భూపతి.

బస్సు మాంచి జోరుగా పోతోంది. దారిలో డ్రైవరు చటుక్కుని బస్సు

పి. కైలాసం - వెల్లటూరు

ఆపేడు. ఆపటంతో అటునుంచి ఐదుగురూ ఇటునుంచీ ఐదుగురూ చెట్లచాటునుంచి పరుగెత్తివచ్చి, బస్సులో చొరబడ్డారు. 'ఎక్కడి వాళ్ళక్కడే వుండండి! కదిలితే పిస్తోళ్లు పేల్చేస్తాం! డబ్బూదస్కం అంతా బైటికి తియ్యండి!' అని గద్దించారు.

అందరూ తమతమ సొమ్ముల్ని పైకి తీశారు. అందరిలోకీ నిర్విచారంగా ఉన్న వాడు ఒక్క అశ్వద్ధనారాయణే. బస్సు ఛార్జీ రూపాయి పోను జేబులో ఒక్క పదిఅణాలే మిగిలింది. ఆ చిల్లర పైకి తీసి సిద్ధంగా ఉంచుకొని, పక్కనున్న భూపతితో, "నువ్వు నాకన్నా అదృష్టవంతుడివేయ్. నీవద్ద ఒక్క దమ్మిడీకూడా లేదాయే!' అంటూ యాథాలాభంగా వాడి ముఖంకేసి చూశాడు.

భూపతి మాట్లాడలేదు. దొంగలు దోచుకుంటూ వస్తున్నారు. మరోనిమిషానికి తనవంతుకూడా వస్తుందే! ఒకటీ రెండూ కాదు, దగ్గర పాతికరూపాయ లున్నాయే! అని భయపడ్డాడు. ఏం తోచిందోగాని, చటుక్కుని బొడ్డుకొంగులో వున్న ఐదు రూపాయల నోట్లు ఐదూ తీసి, సావుకారు చేతిలోపెట్టి, "లెక్క చూసుకోండి. మీకివ్వవలసిన బాకీ పాతికా ఇచ్చేశాను! ఋణం తీరిపోయింది!" అన్నాడు. నిర్ఘాంతపోయాడు సావుకారు. తన పది అణాలతో పాటు ఆ పాతిక రూపాయలూకూడా చేర్చి, దొంగలు తనదగ్గిరకు రావటంతోనే ఇచ్చేశాడు అశ్వద్ధనారాయణ!

అందర్నీ దోచుకోడం అయింది. ఒక్క భూపతే మిగిలేడు. "నాదగ్గిర కానీకూడా లే!" దన్నాడు ధైర్యంగా. దొంగలు నమ్మలేదు. "ఏమీ లేకుండా ఎలా ప్రయాణం చేస్తున్నావు?" అని నిలదీసి అడిగి, నాలుగు ఉతికారు. ఇదంతా కళ్ళారా చూస్తోన్న సావుకారు, "అదునుకు అప్పు తీర్చి, నామానం కాపాడేడు భూపతి!" అనుకుని సంతోషించాడు.



1



2



## నేటి పాపలు రేపటి పౌరులు





3

4

1. చి॥ మాస్టర్. నాగు, తెనాలి
2. చి॥ రోహిణీప్రసాద్, మద్రాసు
3. చి॥ జి. విజయకుమార్, మాంబళం
4. చి॥ అమాత్య, తిరువళిక్కేణి

# అట్టమీంది బొమ్మ

ద్వాపరయుగంలో నరకాసురుడనే రాక్షసుడు తన తల్లిచేతప్ప మరణంలేకుండా వరం పొందాడు. ఈ వరగర్వంచేత కన్నుమిన్నుగానక సమస్త లోకాలనూ బాధపెట్టసాగాడు. వాని బాధకు ఓర్వలేక జనులు శ్రీ కృష్ణభగవానునివద్దకు పోయి మొరపెట్టుకున్నారు.

ఆర్తజనరక్షకుడైన కృష్ణుడు ప్రజలకు అభయమిచ్చి, నరకాసురుడితో యుద్ధానికి తలపడ్డాడు. ఆరోజున కృష్ణుని భార్య సత్యభామకూడా భర్తతో బయల్దేరింది.

శ్రీకృష్ణ నరకాసురుల మధ్య తీవ్ర యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో కృష్ణుడు వేసిన బాణాలన్నీ వ్యర్థమయినై. నరకాసురుడి బాణాలు మట్టుకు కృష్ణుణ్ణి తాకుతూ వచ్చినై.

అప్పుడు కృష్ణుడు తన శక్తిఅంతటితో ఒక గొప్ప బాణం వేశాడు. నరకుడు ప్రతిగా ఒకబాణం ప్రయోగించేసరికి కృష్ణుడు మూర్ఛితుడయ్యాడు. ప్రాణాలు తీసేటటువంటి మరొక బాణం ఆవెంటనే ప్రయోగించాడు నరకుడు.

ఇదంతా కనిపెడుతూవున్న సత్యభామ అతి శక్తివంతమైన ఒక గొప్పబాణం ప్రయోగించేసరికి, అది నరకుడి బాణాల్ని తునాతునకలుచేసివేస్తూ, సరాసరి వాని గుండెలో దూసుకుపోయింది. "హా, తల్లీ!"—అని కేకవేస్తూ, వాడు అమట్టునే నేలకు ఒరిగాడు.

కృష్ణుడు తేరుకున్నాడు. అప్పుడు అతనికి నరకుని పూర్వజన్మవృత్తాంతం స్ఫురణకు వచ్చింది: పూర్వం హిరణ్యాకశిపుడు భూదేవిని ఎత్తుకుపోయి సముద్రంలో దాగొన్నాడు. విష్ణువు వరహావతారమెత్తి, హిరణ్యాకశిపుని చంపి, భూదేవిని ఉద్ధరించాడు. భూదేవి కొడుకే ఈ నరకాసురుడు. భూదేవే సత్యభామ.

ఇప్పుడు— భర్తను రక్షించుకోవడం కోసం కొడుకుపైన బాణం వేయవలసి వచ్చింది. ఇందుకు విచారించక నరకుడు: "అమ్మా!—నాకు అవసానకాలం ప్రాప్తించింది. ఇక గడియో క్షణమో. నా పేరు శాశ్వతంగా లోకంలో ఉండిపోవటానికిగాను ఈరోజు ఒక పర్వముగా ఎంచి జనులందరూ సుఖంగా కాలం గడపాలని నా ప్రార్థన" అన్నాడు-దీనినిబట్టే దీపావళి ముందురోజు 'నరకచతుర్దశి'గా ఈనాటికిన్నీ నిలిచిపోయింది.

ఫాదుషామాత్రమే కాదు, రాజ్యంలోని జనమంతా వచ్చి విరగబడి, యాంత్రిక పక్షి చేసే గానం విని ఆనందిస్తూ వచ్చారు.

ఒకనాటి రాత్రి—ఫాదుషావారి శయ్యాగారంలో అమర్చబడిన ఆ యాంత్రిక పక్షి — అంతఃపుర గాయకి — పాడుతూ పాడుతూ వుండగా హ్ర్ర్ర్ మని చిత్రమైన ధ్వని అయింది! లిప్తపాటు నిశ్శబ్దంగావుండి, గానం నిలిచిపోయింది.

ఇలా జరగటంతో, ఫాదుషావారికి ఆశాభంగం కలిగింది. ఆస్థానంలో వుండే నిపుణులంతా చేరి యాంత్రిక పక్షి మరలన్నీ సవరించి ఎలాఐతేం, మరమ్మతు చేశారు. ఐతే—ఇదంతా పరిశీలించిన మరమ్మతుదారు ఏమన్నాడంటే 'ప్రభూ! ఈ యాంత్రికపక్షిని మోతాదుగా, ఏటా ఒక్కసారి మాత్రం వాడుకుంటే తప్ప లేకుంటే యేంజరగబోతుందో చెప్పలేము!' అని విన్నవించాడు.

'ఈ మాట నిజానికి, పర్షియాదేశానికే మచ్చ తెచ్చిపెట్టినట్టుగా వుంది. ఇంతకంటె అవమానం వేరేమి కావాలె!' అంటూ, ఆస్థానగాయకుడు చాలా కష్టమైన మాటలతో ఉపన్యసిస్తూ, 'యీ యాంత్రికపక్షి ఎప్పటిలాగానే పాడుతూ వున్న'దని ఘంటాపథంగా బహిరంగ సభలో చెప్పాడు.

## ఆఖరిపాట

ఐదేళ్ళు గడిచినై. ఫాదుషా బెంగతో మంచంపట్టాడు. పరిస్థితి చూడగా నయమయేటట్టు లేదు. అందుచేత, ఆయన స్థానే కొత్త ఫాదుషా రాజ్యానికి వచ్చాడు. దర్బారులో ప్రముఖులంతా కొత్త ఫాదుషాను అభినందించబోయారు. పాత పాదుషా తెరపు మరపులలో ఉన్నాడే కాని, మరణించలేదు.

ఆస్థానంలోని పరివారమంతా కొత్త ఫాదుషావారిని సన్మానించటంలో హడావుడి పడుతున్నారు! ఈ హడావిడి, సందడి, జేజేలు అన్నీ పాతఫాదుషా చెవులకు స్పష్టంగా వినిపించినై. వినిపించి, ఆయనకు ముచ్చెమటలూ పోసినై. ఊపిరి అందలేదు. చివరకు 'భరించలేను...' అన్నాడు, భారంగా.

అప్పుడు ఆయన, ఎదట వున్న యాంత్రికపక్షితో 'ఓ చిన్నారిపక్షీ!—నీకు ఏలోపంలేకుండా సమస్త సదుపాయాలూ చేశానే. ఇప్పుడు పాడమని ఆజ్ఞాపిస్తున్నాను పాడు,' అన్నాడు. మాటా లేదు, మంతీ లేదు; మర తిప్పేవాళ్ళెవళ్ళూ లేకపోవటంవల్ల ఆ పక్షి మూగిదానిలాగా నిలబడి అలానే వుండిపోయింది.

# ఇంద్ర

## మాజిక్ దండము

పద్దెనిమిది అంగుళాల పొడుగు—అరఅంగుళం లావూ ఉన్న ఒక మాజిక్ కర్రను తీసుకొచ్చి ఇంద్రజాలికుడు ప్రేక్షకులకు చూపించాలి. నిజానికి కర్రే తీసుకు రావలసిన పనికూడా లేదు. మామూలు పెన్సిల్ కాని, కలం కాని, అడుగుబద్దకాని, ఏదైనా ఈ ఇంద్రజాలానికి ఉపయోగించవచ్చు.

కాని, అలాంటివాటికన్న దీనికొక ప్రత్యేకమైన మాజిక్ కర్రలాంటిది ఉపయోగించటం మంచిది—ఇంద్రజాలికుడి ఆధిక్యత నిలుపుకోటానికి—



తర్వాత ఇంద్రజాలికుడు మొదటి చిత్రంలోలాగ రెండు చేతులవ్రేళ్ళూ ప్రేక్షకులకు కన్పించేలా ప్రదర్శించాలి.

ఇంద్రజాలికుని వ్రేళ్లు అన్నీ పైకి కన్పిస్తూనే ఉంటై. అయితే, లోపలి వైపు ఈ మాజిక్ కర్ర నిరాధారంగా ఎలా నిలబడింది? అదే తమాషా. కాని ఇందులో ఉన్న కిటుకు చెపితే నవ్వొస్తుంది-ఇది అంత సులభ మన్నమాట!

ఇది చెయ్యటం ఎంత సులభమైనా ప్రేక్షకులుమాత్రం అంత సులభంగా ఈ గారడీని కనిపెట్టలేరు. నా అనుభవాన్ని పట్టిచూస్తే ఎంత గొప్ప గొప్ప ఇంద్రజాలాలు అనుకునే వాటికైనా కొన్ని సులభమైన పద్ధతులున్నాయి.

# జాలము

ఈ గారడీ అంతా అటువంటి వాటిమీదనే ఆధారపడి ఉంది. ఇంద్రజాలం పైకి చూడటానికి ఎంత ఆశ్చర్యంగా ఉంటుందో, సామాన్యంగా దాని అసలు కిటుకు అంత సులభంగా ఉంటుంది.

మొదటి చిత్రం చూస్తే ఇంద్రజాలికుడి చేతుల వెనుక వైపు ఈ కర్ర ఇంత ఆశ్చర్యంగా నిలబడిందే—ఇది నిజంగా సంభవమేనా, కాదా? అనిపిస్తుంది.

కాని అసంభవమైన విషయాలను సహజంగా ఉన్నట్లు కన్పింపచెయ్యటమే ఇంద్రజాలంలో ఉన్న రహస్యం. రెండో చిత్రం చూస్తే తప్పకుండా నవ్వొస్తుంది; ఎంచేతనంటే ఇంద్రజాలికుడు వెనుకవైపున ఒక వ్రేలితో ఈ మాజిక్ కర్రను అదిమి పట్టుకున్నట్లు స్పష్టంగా కన్పిస్తూనేవుంది. మరి, యిప్పుడు ఆలోచించండి, ఇదెంత సులువైన ట్రిక్కో!



---

ఈ గారడినిగురించి పాఠకులు ఇంకావివరంగా తెలుసుకోదలిస్తే 'చందమామ' పేరు ఉదహరిస్తూ నరానరి ప్రొఫెసరుగారికి వ్రాయవచ్చు. ఉత్తరాలు ఇంగ్లీషుభాషలోనే వ్రాయాలి. ఇది ముఖ్యం.

అడ్రెసు : ప్రొఫెసరు పి. సి. సర్కార్, మెజీషియన్

12/3/A, జమీర్‌లేన్, బాలీగంజ్ కలకత్తా - 19

CHITRA



పంపినవారు : ఎస్. వరలక్ష్మి - గంగలకుదురు

గతనెల చందమామ 12-వ పేజీలోని 'తప్పుపట్టండి' బొమ్మకు సమాధానాలు :

1. బల్లికి వెనుకకాళ్ళు ముందూ, ముందు కాళ్ళు వెనకా వుండాలి.
2. మనిషికి మెడ వుండాలి.
3. సూదిలోని దారం రంధ్రం ఇవతలకంటా [రావాలి.
4. ఇంటి పక్కగోడ ఒక్కటిమాత్రమే కనిపించాలి.
5. సీసామూతికన్న బిరడా చిన్నదిగావుండాలి.
6. కుర్చీకి నాలుగు కాళ్ళు ఉండాలి.
7. మేకచన్నులు మెడకింద ఉండాలి.
8. డేరాకు మేకులు అమర్చబడి ఉండాలి.
9. గాలి వీచే దిక్కుకే వర్షమూ కురవాలి.

## ఫొటో వ్యాఖ్యల పోటీ

### డిశంబరు ఫొటోల ఫలితాలు



డిశంబరునెల చందమామలో ప్రచురింపబడే ఫొటోలకుగాను, మాకు వచ్చిన వ్యాఖ్యలలో ఉత్తమంగా వున్న ఈ దిగువ వ్యాఖ్యలకు బహుమతి యివ్వడమైనది.

వ్యాఖ్యలు :

మొదటి ఫొటో : 'నిదానం

రెండవ ఫొటో : ప్రధానం'

పంపినవారు :

జి. వి. రమణ - అనంతపురం

బహుమతిపొందిన ఈ వ్యాఖ్యలు, పంపిన వారి పేరుతోనహా డిశంబరు చందమామ ఫొటోల దిగువన ప్రచురిస్తాము. బహుమతి మొత్తం రూ. 10/- డిశంబరు సంచిక వెలువడిన వెంటనే పంపబడుతుంది.



## జనవరి నెలలో

ప్రచురింపబడే ఫొటోల నమూనాలు వివరాలతోసహా ప్రక్క పేజీలో చూడండి

ఒక ముఖ్యసూచన :

మీరు పంపదలచుకున్న వ్యాఖ్యలు కార్డు పైననే వ్రాసిపంపాలి. కొందరు కాగితంపైన వ్రాసి కవరులో పంపుతున్నారు. ఇలాంటివి పరిశీలింపబడవు.

# ఫొటో వ్యాఖ్యల పోటీ

జనవరి 1953 :: బహుమానం రూ. 10/-





జనవరి సంచికలో వచ్చే ఫోటోలు రెండూ పైన చూడండి.
వీటికి సరియైన వ్యాఖ్యలు కావాలి. వివరాలు యివి :—

1. వ్యాఖ్య ఫోటోకు సరిపడేటట్లు వుండాలి.
2. ముచ్చటైన ఒక్కమాటలోగానీ, రెండు మూడు మాటలుగల ఒక చిన్ని వాక్యంలో గానీ వ్యాఖ్య ఉండవచ్చు.
3. అన్నిటికన్న ముఖ్యవిషయం : మొదటి ఫోటోకూ, రెండవ ఫోటోకూ కూర్చేవ్యాఖ్యలు రెండూ ఒకదానికొకటి సంబంధించివుండాలి.
4. ఒక్కొక్కరు ఒక్కొక్క సెట్టు వ్యాఖ్యలకంటే ఎక్కువ పంపకూడదు.
5. ఒక కార్డుపైన మీ వ్యాఖ్య, పూర్తిపేరూ, విలాసమూ వ్రాసి, మాకు పంపాలి.
6. నవంబరు 15-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ఆ తర్వాత చేరిన వ్యాఖ్యలు పరిశీలించబడవు.
7. మాకు చేరిన వ్యాఖ్యలలోకెల్లా అత్యుత్తమంగా వున్న సెట్టుకు (అనగా రెండువ్యాఖ్యలకు కలిపి) రూ. 10/- బహుమతి ఇవ్వబడుతుంది.

వ్యాఖ్యలు పంపవలసిన అడ్రసు :

ఫోటో వ్యాఖ్యల పోటీ - చందమామ పబ్లికేషన్స్ - మదరాసు - 26.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Ltd., Madras 26 and Published by him from Chandamama Publications, Madras 26, Controlling Editor: SRI CHAKRAPANI

Photo by Pranlal K. Patel



బహుమతి
పొందిన వ్యాఖ్య

అందీ అందని ఆకు

పంపినవారు:
కె. రామలక్ష్మి - బెల్‌గామ్

